లీల విలసిల్లఁ బ్రియముఁ జేసెద నేలఁగూల, సంతసముతోడి మెచ్చు పుట్టింతు నీకు.

వ. అనుటయు నచ్యుతుండు ప్రియం బెసంగ నాకిమ్మీరమర్దను మొగంబునఁ జూడ్కి నిలిపి. 120

మ. బకవిధ్వంసన మాచరించితి హిడింబప్రాణముల్ గొంటి కీ
చకనిర్మూలన కేలి సల్పితి జరాసంధాంగకస్వైరభం
జకలీలన్ విలసిల్లితీ వని మనుష్యస్ఫూర్తిమాత్రంబు తే
యొక మర్త్యుండవె యెట్టు నీవు మదిలో నూహింప కిట్లాడితిన్. 121

క. కాళింగాదిక్షోణీపాలురు నున్మదమహాద్విపప్రకరములన్
నేల నిడి కాలఁ జమరితి, వాలిసుతగునృపకుమారవర్గంబులతోన్. 122

వ. అని పలికి కురుపతి యనఁగటాక్షవీక్షణంబు నిగుడ వెండియు. 123

తే. వాలి దుశ్శాసనుని యెమ్ము ప్రియ్యఁ జీరి, నీవు నెత్తురు ద్రావంగ నిన్ను నతఁడు
నూచుచుండియు వలసామ్ని ప్రక్కఁగాక, కవియఁజాలెనె నీపయిఁ బవనతనయ.

చ. అగపడి కచ్చు పట్టి యుటిఁ బాడినమాటల కిప్డు బల్లిదుం
డగఁ గాని యేను బలున్నగుఁ గపటన్నడి నీతనిఁ జంపకుండ నే
మిగ సమయంబు నీసి తెటఁ జేసి పలోకా యంటి నృపాలుతోడ నీ
మగఁటిమిచందముల్ దలఁచి మారుతినందన యూఱడిల్లితిన్. 125

చ. తులువతనంబునన్ సభను ద్రౌపది ముందల పట్టి యీడ్చి య
ట్లలఁపఁగఁ జూచి నీవు దగ నాడిన రెండు పెఱంగులందుఁ బెం
పొలయఁగ దుస్ససేనుఁ ననియొక్కటి దీర్చితి తీర్పు మింక బా
హులకసి వూన నీనిపనియుం ద్వరితక్రమవిక్రమంబునన్. 126

తే. పరజయము నొంది కట్టును పట్ట మఖిల,ధరణిరాజ్యంబునకు ధర్మతనయుఁ బ్రీతి
బంధులకు నల్లఁ గన్నులపండు వగుచు, నీవుఁదమ్ములు సుఖవృత్తి నెలవుకొనుఁడు.

వ. అని మఱియును. 128

చ. బరనస మొప్ప నీవు గదపంపును సేయఁ దలంచి తాఁకినం
గురుపతి నిర్జితుం డగుట కుం బవనాత్మజ యేను బూఁట పో
టరితన మెల్లఁ జూపును గడంగుము నీవని యేలిమాటమై
నరవర ధర్మసూనుఁడు పికనన్ విజయం బొసఁగెన్ మఱందికిన్. 129

వ. ఇవ్విధంబున నృకోదరునకు జయప్రదంబు లగుమాట లాడి దుర్యోధనుండు దండి
మగండు శ్రమంబునుం జాలఁ గలండు నీ వతిప్రయత్నంబునఁ బెనంగవలయుఁ జుమ్మీ
యని పలికె నప్పుడు సాత్యకి యూసమీరనందను నగ్గించెఁ బాంచాలురుఁ దక్కనుం
గలుగు ధరణీశులు సబ్బలుమగనిఁ బ్రశంసించి రతం డగ్రజునాననం బాలోకించి.

చ. వినుము నరేంద్ర యేను బలవిక్రమముల్ వొగడొంద నిక్కల
ఘ్ను నిపయి నానసంబునతికోపము పార్థుఁడు ఖాండవంబునం

దనలము పర్వఁ జేసినటు లగ్గలికన్ నిగిడించెదన్ గదం
గొనిమొదఁ బ్రాణముల్ మహి యకుంఠితశాస్తి గ నేలు మంతయున్. 131

ఆ. మహితకీర్తి పుష్పమాలికఁ బూన్చెద, నిన్నుఁ జీకురాజు నేఁడు వనరుఁ
గాక శకునిబుద్ధికతమునఁ దమ కింత, పుట్టె నని తనూజుపాలియు చెట్టెఁగి. 132

వ. అని పలికి సన్నాహంబు శోభిల్లుచుండ గదాదండంబుఁ గేల నమర్చి వృత్రున కభిముఖుం డగువాసవుండునుం బోలె దుర్యోధనునికి మొగం బై నిర్వ్యూహం బై నకుండాలంబుచందంబున నున్నయన్నరపతిఁ గనుంగొని తమయన్నయుఁ దమ్ములు నెమ్మనంబుల సంతసిల్లఁ దాను సమగ్రోల్లాసభాసితుం డగుచు నతని కిట్లనియె. 133

ఉ. ఇట్టిది క్రూరకర్మ మని యించుక కొంకక లక్కయింటఁ జి
చ్చొట్టితి మాయజూదమున నుత్తము ధర్మజుఁ [1]దూలఁ బుచ్చి తా
చుట్టలుఁ బెద్దలుం జెలులుఁ జూడఁగ ద్రోవది భంగపెట్టితి
ట్టట్టన కింకఁ దత్ఫలము లన్నిటి నొందుము చేరి తగ్గ నైను. 134

సీ. గాంగేయకుంభజకర్ణశల్యాదులు, నీకుఁ గాఁ బెనఁగి యనేకబంధు
మిత్రులు మడిసిరి ధాత్రీపతులఁ దోడు, తెచ్చితి పలువురఁ జచ్చె గంత
వట్టువారును దోడఁబుట్టువు లెల్లను, గూలి రంతటికిని మూల మైన
శకుని గీటడఁగె నింకొకరుఁడ వీ వున్న, వాఁడవు నిను నిన్ను నేఁడు నాదు

తే. గదకు నెరసేసి లోకంబు కల్మషంబు, లేను బాపెద నీరజ్జు గేల నాతఁ
జక్కనై రమ్ము మద్భుజాస్తంభశుంభ, దుగ్రకేళికిఁ బాత్ర మైమోట దక్కి.

చ. అనుడు నెదిర్చి సీతనయుఁ డాతని కిట్లను నేల రిత్తగ
ర్జనములు గానవే పటుభుజాకలితోగ్రగదాసముద్భటున్
నను నిటు రమ్ము సూపుము రణంబున నీదుబలంబుఁ జేనయున్
మన మిటు చేరి నిల్చి వెడమాటల నాడుచు నుక్కి యొప్పునే. 136

క. వినుము గదారణమున నను, జెనయఁగ వాసవున కైనఁ జెల్లదు [2]నీవీ
యనిఁ బాడిదప్పకుండఁగఁ, బెనఁగుము ప్రాణంబుతోడఁ బ్రదిలెదు భీమా.

వ. అనిన విని పాంచాలురుం దక్షిణజనపాలురుం బ్రశంసించి మత్తమాతంగంబుఁ దలశబ్దంబుల నుబ్బం జేయునోజ రారాజుఁ బ్రహ్లాదంబు నొందించిరి గజబృంహితంబులు హయహేషితంబులును జెలంగె నాయుధంబు లెక్కుడుమెఱుంగులఁ బొలిచెఁ దదనంతరంబ యెల్లవారును నెడగలుగఁ గూర్చుండిరి రమ్మహావీరులు దలపడువా రై వీరోద్రేకంబునం జేసి యతిలోకం బగుసవష్టంభంబున విజృంభించి యొండొరుల నవలోకించి రట్టియెడ. 138

1. గోలుపుచ్చి. 2 నీవే, యనిపాడి; నీవే యొనపాడి.

రావించెఁ దండులకుఁ బ్రముఖభోజనసాధనములు సంపన్నహృద్యములు గాఁగఁ
ఆ. చేరఁ బనిచె నిట్లు తీర్థయాత్రాసంవి, ధాన మాచరించి మానసీయ
మగుసరస్వతీమహాంభోధిసంగమ, స్థానమునకుఁ జనియె సవిసయముగ. 145

వ. అది ప్రభాసం బనుపేరం బరఁగు న[1]ట్లందులకుఁ జని తీర్థసేవనం బనుష్ఠించి యంతనుండియుఁ బథిశ్రాంతిప్రయాణంబుల సరస్వతి చేరువ నడచి తదీయసకల తీర్థంబు లాడుచు నన్నపానంబుల నాసనశయనయానంబులను ధేనుకనక రత్నాంబరాభరణాదిద్రవ్యంబులను విప్రుల నతిప్రీతులఁ జేయుచు బాలవృద్ధ వనితావికలాంగదుర్బలప్రాయులఁ బరిశ్రాంతు లైనయెడలం[2]దడిమికొని యథేష్ట ప్రకారంబుల శరీరస్థితి నడపింపఁ దగువారి నియోగించి మఱియు ననేకధర్మంబు లాచరించుచుఁ గురుక్షేత్రంబునకు వచ్చె ననుటయు జనమేజయుం డాతీర్థవిశేషంబులు వివరించి చెప్పు మనుడు వైశంపాయనుం డి ట్లనియె. 146

క. మును చనియెఁ బ్రభాసమునకు, నని చెప్పితి నతని నచట మహాత్తరతీర్థ
మ్ము నరేంద్ర యందుఁ జంద్రుఁడు, [3]దనయక్ష్మం దీర్చుకొని గతవ్యథుఁడయ్యెన్.

ప్రభాసతీర్థప్రభావవర్ణనము.

వ. అత్తెఱం గెఱింగించెద దక్షకన్యకల నశ్వినాద్యలగున ష్టవింశతిసంఖ్యలఁ జంద్రుండు వివాహం బయ్యె నందు రోహిణి రూపాతిశయవతి యగుటం జేసి తదాసక్తుం డైనఁ దక్కటివారు వగ నొంది తండ్రికడకుం జని చంద్రుని యన్యాయం బెఱింగించిన నాప్రజాపతి చంద్రునితో నుగ్గడించి యిది చాల నధర్మం బింక నిట్లు సేసి తేని శపింతుఁ జుమ్మీ సముఁడ వై వర్తింపు మనుటయు నమ్మాటదెస ననాదరంబు సేసి యతండు వెండియుఁ దొంటియట్ల వర్తించిన నెఱింగి యమ్మహాత్ముండు కోపించి యక్షుఁడవు గాను మని శాపం బిచ్చిన నయ్యోషధినాథుండు నానాఁటికిఁ గృశుం డయ్యె న ట్లాతనివలుచేత నతండు పోఁడిమి మాలిన నోషధులు పసచెడియె దానఁ బ్రజలు డయ్యం జొచ్చి రది చంద్రకార్శ్యహేతుకం బగుట యనుసంధించి. 148

క. దేవత లమృతాంశునితో, నీ వేటికిఁ గృశుఁడ వైతి నిక్కము చెపుమా,
నావుడుఁ దన తెఱఁ గేర్పడఁ, గా వారికి నతఁడు సెప్పెఁ గౌరవముఖ్యా. 149

క. విని వార లతనిఁ దోడ్కొని, చని ప్రార్థించుటయుఁ దగఁ బ్రసన్నుం డై యి
ట్లను దక్షుఁ డఖిలభార్యా, జనులయెడ నడవవలయు శశి సమవృత్తిన్. 150

వ. అట్లు నడచుచు సరస్వతీజలనిధిసంగమకలితం బైనతీర్థంబుజలంబుల నిమగ్నుం డై వృద్ధిఁ బొందు వరుసన పదియేనుపదియేనుదినంబులు సంక్షయంబును బ్రవర్ధనంబు నొందం గలవాఁ డని చెప్పి వెండియు. 151

క. అమవస నమవస నాతీ, ర్థమునఁ గృతస్నానుఁ డై సుధాకరుఁడు ప్రవృ

1 ట్లందు నని. 2 దఱిమికొని. 3 దనుక్షయము.

ద్ధిమహితతనుఁ డగు నని యతఁ, డమరుల వీడ్కొల్పి యామృగాంకునితోడన్.

వ. వనితలకు విప్రులకు సనమానంబు సేయకుమీ యని పలికి వీడ్కొలిపె నట్లు శాపమోక్షంబు గని చంద్రుం డాతీర్థంబునకుఁ జని తదీయజలస్నానంబున నాప్యాయితశరీరుం డై లోకప్రభాసుం డయ్యె నది గారణంబుగా నాతీర్థంబు ప్రభాసం బనుపేరం బ్రసిద్ధి నొందె నందుండి యారోహిణీనందనుం డరిగి చమసోద్భేదనం బనుతీర్థంబున నొకరాత్రి వసియించి యుదపానంబునకుం బోయె దానివిశేషం బాకర్ణింపుము. 153

క. త్రితుఁ డనఁగా ద్వితుఁ డన నే, కతుఁ డనఁగఁ దపస్విసుతులు గల రావిప్ర
త్రితయము భూపాలునివలను, గ్రతునకు లాసర్పి ధేనుగణముం బడసెన్. 154

వ. వడసి యొక్కెట నేకాంతమునఁ దయ్యేకతద్వితులు నిజభ్రాత యగుత్రితుని వంచించి తా రాగోవులఁ దోలంగ నడిచి కొనిపోవువారుగాఁ బాపబుద్ధి నుత్సహించి రాసమయంబునఁ దెరువున నొక్కవృకం బున్నఁ దద్భయంబునం దోలంగం బోయి ప్రమాదంబునఁ ద్రితుండు నూతం బడిన నయ్యిరువురు నతని నుపేక్షించి ధేనువులం గొనిపోయి రమ్మునికుమారుండు నిర్జలం బైనయయ్యుదపానంబున నుండి సోమపానంబు సేసినం గాని యీదురితంబు వాయ దని తలంచి యజ్ఞసాధనంబునకుఁ బ్రతినిధులు సంకల్పరూపంబున సంపాదించికొని క్రతు వొనరించిన దేవతలు సన్నిధి సేసి హవిర్భాగంబులు గైకొనిరి సరస్వతీజలంబు లయ్యూపంబున నుద్గతం బై యాసవనపతి నుద్ధరించె నయ్యమరులు వరం బడుగు మనిన నమ్మహాద్విజుండు. 155

తే. వినుఁ డుపస్పర్శ మిందుఁ జేసినయాతఁడు
వడయువాఁడు మహితసోమపానఫలము
వరము నాకిది యనుటయు వారలట్టు
లవుట సంప్రీతిమై[1] నిచ్చి దివికిఁ జనిరి. 156

వ. అట్టియయ్యుదపానంబును సేవించి వినశనంబునకుఁ జనియెఁ దత్తీర్థంబు హీనజాతులకుఁ బొడసూపక నశించుఁ గావున వినశనం బనం బరఁగె మఱియు భూమికంబునకుఁ బోయె నది యప్సరోగీతనృత్యవిహారభూమి యగుట భూమికం బనఁ బ్రసిద్ధం బయ్యెఁ బదంపడి గంధర్వతీర్థంబునకు నేఁగె నది విశ్వావసుప్రభృతిగంధర్వతపస్సిద్ధిస్థానం బందుండి గర్గస్రోతంబునకుఁ జనియె నందు గర్గుండు సన్మునిసేవితుం డై చిరకాలంబు వసించె నచ్చోటు గదలి యాబలభద్రుండు. 157

ఆ. వినుము శంఖతీర్థమునకు నైసర్గికమునకు నాగధన్వమునకు వరుసఁ
జనియె నాగధన్వ మనునది వాసుకిస్థాన మచటఁ దొల్లి సకలసురులు. 158

1 జెప్పి.

వ. నాగేంద్రత్వమునకు వాసుకి నభిషేకించి యందుండి యాసీలాంబరుండు నైమిశంబున కరిగె నయ్యెడం దొల్లి [1]సరస్వతి యనునేఱు దూరంబై యుండ నైమిశారణ్యవాసు లగుమునులు క్రతువు సేయం దొడంగిన నాసరస్వతి వారల సంభావించుటకు మలంగి పాఱినకతంబున నదటసమీపం బయ్యె నవ్విశేషంబు విని విస్మితుం డగుచు నాహలాయుధుం డాతీర్థంబుఁ గొనియాడి సప్తసారస్వతంబునకుం బోయె నచ్చట మంకణుం డనుమహాముని వసించుఁ దొల్లి నలినభవుసత్త్రంబున నైమిశారణ్యమునులయాగంబున గయునిక్రతువున నుద్దాలకునధ్వరంబున వసిష్ఠునసత్త్రంబున గురునిసవనంబున వెండియు నొకమఱి యాపరమేష్ఠియజ్ఞంబున హిమవత్పృష్ఠంబునందు నైనం దత్తత్ప్రదేశంబులకు సుప్రభయుఁ గనకాక్షియు విశాలయు [2]సురేణువయు నోఘవతియు సువేణియు విమలోదకయు ననునామంబుల నేడువేషంబుల సరస్వతి చనియజమానసకలదేవమునిసంభావన వడసె నట్టిసప్తాకారంబుల నాసంయమియాశ్రమంబునఁ బ్రవర్తించుట నది సప్తసారస్వతం బనం బరఁగె నమ్మంకణునిచరితంబులు మఱియునుం గల వాశ్చర్యకరంబులు వినుము. 159

మంకణమహామునిమాహాత్మ్యాభివర్ణనము

సీ. అతఁడు సరస్వతీ నవగాహనము సేయు, చుండి యాచేరువ నొక్కతె తడువు
గట్టక నీళ్లాడఁ గాఁ జూడఁ దనదు శు, క్లము నిర్గమించిన ఘటసురక్షి
తము సేయ సప్తభేదము లొంది యది సప్త, ఋషులు నైరి వారు మరుద్గణంబు
నకు సంజననకారణం బైరి విను మొక్క, నాఁ డత్తపస్వి వ్రేల్కొక్కటి దర్భ
ఆ. గంటఁ గూరయసరుఁ గాఱిన నర్తించె, నతఁడు తపముసిద్ధిఁ గాత్మఁ బొంగి
జగము లెల్ల దానఁ సంక్షోభ మొందె ని, ర్జరులు భీతిఁ జనిరి శంభుఁ గాన.

వ. కని యంతయు నెఱింగించిన నద్దైవోత్తముం డాభూదేవోత్తముపాలి కరిగి యిది యెంతటివిశేషంబు తపంబు లిట్టివే నర్తించుట మాను మని పలికి తనయంగుటంబు వ్రేలం గీఱిన నందు భస్మంబు గాఱిన నాసంయమి సిగ్గువడి దండప్రణామంబు సేసి. 161

ఆ. దైవ మెల్లఁ దలఁప నీవ సమస్తజ, గంబులకును నేడుగడయు నీవ
కర్మఫలదుఁడవును గర్మప్రదుండవు, నీవ కరుణ సన్నుఁ గావు మభవ. 162

వ. అని వెండియు ననేకప్రకారంబులం బ్రశంసించినం బ్రసన్నుం డై పశుపతి యతనికిఁ దపఃప్రభావం బక్షీణంబు గా వరం బిచ్చి చనియె నమ్మహాముని నృత్యంబు మానిన జగంబులసంక్షోభంబు శాంతం బయ్యె నట్టియమ్మహాత్మునినివాసం బైనసప్తసారస్వతంబుననుండి యాసీరి యౌశనసంబునకుం బోయె వినుము తొల్లి రఘురామునిచేతఁ జచ్చినమహోదరుం డనునసురతలపునుక

1 'యయ్యేటికి దూరం బై యుండ నైమి' వ్రా.ప్ర. 2 సుతనువును.

యొక్క తపస్వికాలఁ దగిలి పుచ్చరా కున్న నతండు వేదనం బొందుచుండం
గని యార్యులు సరస్వతి నౌశనం బనుతీర్థంబు శుక్రుండు దపంబుసేసినచో
టందుఁ బొనర్పు నీదురితంబు నాయు ననిన మహోదరనామధేయం డగు నా
సంయమి యచ్చటికిఁ జనిసఁ గపాలంబు ముక్తం బయ్యె దానం జేసి యది కపాల
మోచనం బనం బరఁగు నచ్చోటు వదలి పృథూదకంబునకుం జనియెఁ దదీయ
విశేషంబు వినుము గాధి యనుమహారాజునకు విశ్వామిత్రుం డనునతండు.

ఆ. తండ్రియట్ల సకలధాత్రీశుం డై యుండి, దనుజమథనమునకు దండు వెడలి
యరుగునెడ వసిష్ఠునాశ్రమంబునపొంత, విడియఁ బరిజనములు వినయ మెడలి.

వ. అందు దుర్నయంబు లాచరించిన నమ్మునికోపించి నిజహోమధేనువు నాలో
కించి నీబలంబు సనుపు మనిన నది తనమాహాత్మ్యంబున నచట నావహిం
చినఘోరాకారు లగువీరులఁ బనుప వార లారాజునరూథిని మడియించిన
శేషించినజనంబులు పలుగడలం బాఱి నట్లు దురవస్థం బొందునాసేనం జూచి
యగ్గాధినందనుం డెల్లశక్తులకంటెఁ దపశ్శక్తి మెక్కు డగుట యెఱింగి యాపృ
థూదకంబునఁ దపంబు సేయుచుండ దానికి దేవపతి విఘ్నంబు సేయ నుఱియు
నియమనిష్ఠుం డై బ్రహ్మచేత బ్రాహ్మణ్యంబును బడసె న త్తీర్థంబుననుండి బల
భద్రుండు బకాశ్రమంబున కరిగె నయ్యెడ బకుం డనుమునీంద్రుండు తొల్లి.

క. ధృతరాష్ట్రుం డనాదరమున, నతని నమ్ము నధిక్షేపించి పలికినఁ గోపా
న్వితుఁ డై సరోషము మునిదైన్యము,ధృతనదమాంసముల నతనిరాష్ట్రం గీడ్పడవన్.

ఆ. నలుకఁబడినమునిపు తేజోగుణ సమనివరాష్ట్రంబు సకలజంతుసముదయములు
మడియ మిన్నవిన్నదుల మ్రులిక యాభూపతి, యాత్తపస్విపాలి కరుగుదెంచి. 167

వ. దండప్రణామం బాచరించి పెక్కు భంగులఁ దేలించి మున్ను ధేనునిమిత్తం
బగుదుర్భాషణంబుల నింత పుట్టుటం జేసి యాసంయమికి ననేకధేనువుల
నొసంగి దురితోపశాంతి యొనర్చె నట్టిబకాశ్రమంబుననుండి రేవతీరమ
ణుండు యయాతంబునకుం బోయె నందు యయాతియజ్ఞంబున భోజనసమ
యంబున ఘృతదుగ్ధాదులయందు నిష్ఫురం జెయ్యది గోరిన నది యెల్ల సరస్వతి
సంపూర్ణమనోగతంబు గా నొసంగుచు వచ్చె నయ్యెడ గదలి వసిష్ఠావగా
హంబునకు వచ్చెఁ దత్ప్రదేశంబు తొల్లి విశ్వామిత్రునాశ్రమం బతండు వసి
ష్ఠునెడఁ దపోవిషయమునుత్సాహంబునఁ గుపితుం డై. 168

సీ. అతని వధించుటకై సరస్వతి మదిఁ, దలఁచిన నానది తత్క్షణంబ
సౌమ్యవేషంబునఁ జనుదెంచి నిభృత యై, పని యేమి యనిన నమ్ముని వసిష్ఠుఁ
గొనిరమ్ము నాకడ కని పంచెఁ బంచిన, వార లిద్దఱతపోవైభవంబు
నకు భయ మందుచు నరనాథ యరిగి వ, సిష్ఠున కప్పని సెప్పెఁ దెలియ

తే. నాతఁ డవ్వాహినికి నిట్టు లనియె నన్ను, నీవు గొనిపోక తక్కిన నీకు శాప

మిచ్చు నగ్గాధిసుతుఁడు దరిదిచ్చు సలుపు, మించుకేనియుఁ గొంకక -యెప్పుడైన.

వ. అని యనుజ్ఞ యిచ్చిన సరస్వతి యత్తపస్వి తనచేరువ నొకప్పుడు జపయుక్తుం డై యుండం గూలాపహరణంబు సేసి వఱుత నమ్మహాత్ముం గొనిపోయిన నతం డాంగిరసమంత్రంబుల నత్తరంగిణిం బ్రణుతించె నదియు సంప్రీత యగుచు నమ్ముని విశ్వామిత్రునకు సన్నిహితుం జేసిన నతని నగ్గాధిసూనుండు వధియింప సాధనం బన్వేషించునాలోన వంచించి యాప్రవాహం బవ్వసిష్ఠుఁ దొలంగించినఁ గోపించి విశ్వామిత్రుండు శోణితవాహిని యగు మని శపించిన నొక్కసంవత్సరం బత్తటిని దైత్యసేవిత యై యుండె నత్తీర్థంబునకుఁ గొందఱుమును లేతెంచి యాదురవస్థ యాలోకించి. 170

తే. అమ్మహానది నడిగి వా -ర త్తెఱంగు, దెలిసి నిజయత్నబలమునఁ -దీర్పఁ దీఱె
నట్టిదురవస్థ వారలు -నాత్మఁ బ్రీతి, యూనఁ జలిపిరి పావన-స్నానవిధులు. 171

వ. అప్పుడు గొందఱు బ్రహ్మరాక్షసు లమ్మునులకుఁ బ్రణమిల్లి తమ చేసినవిప్రద్వేషగురుజనావమానదుష్టాన్నభక్షణంబు లగుపాతకంబులు వేఱువేఱ యుపన్యసించి యే మిమ్మెడ వసియించి యున్నవారము మాకు నిష్కృతి యనుగ్రహింపవలయు ననుటయు వార లాపనికి సరస్వతిం బ్రార్థించిన నమ్మహానది యరుణానదివలన నట్టితెఱం గగు తెఱుంగుం గావున నిగూఢంబుగా నరుణం దనలోనికిఁ దెచ్చి దీన మజ్జనంబు సేయుఁ డని యనుమతి సేసిన. 172

ఆ. అజ్జలమునఁ గ్రుంకి -యాబ్రహ్మరాక్షసుల్, తనువు లచట విడిచి -ధర్మపరుల
గతికిఁ బోయి రట్టి-లలితగూఢ మై యున్న, యరుణ తెఱఁ గెఱింగి-యమరపతియు.

వ. తాను సఖ్యంబు సేసి నమ్మించి నముచిఁ జంపినపాపంబు తదీయస్నానంబునం బాపికొనియె నట్టిపుణ్యస్థానంబుననుండి యత్తాలధ్వజుండు సోమతీర్థంబునకుం జనియె నది సోముండు రాజసూయంబు చేసినచోటు యమ్మెడ ననిమిషులు షణ్ముఖునకు నిర్జరసేనాధిపత్యంబునకు నభిషేకంబు సేసి రతండు తారకాదు లైనయసురులం దెగటార్చె నతనిజననాదివృత్తాంతంబు కౌరవవంశజాతుండ వగునీకు విను దగుఁ జెప్పెద నాకర్ణింపుము. 174

కుమారస్వామిప్రభావాభివర్ణనము.

ఆ. హరుఁడు దనదువీర్య-మగ్నియం దిడిన న, హింపఁజాల కజున-కెఱుఁగఁజెప్పి
యతఁడు వనుప దాని -నగ్ని గంగాగర్భ, భూతముగ నొనర్చె -భూపవర్య. 175

వ. తేజోమయం బైనయాగర్భంబు గంగ హిమవన్నగంబుమీఁద సముత్సృష్టంబు సేసినఁ గనకమయం బైనశరస్తంబంబున నగ్నిసన్నిభుం డగుకుమారుం డై యొప్పె నయ్యెడ మెలంగుకృత్తిక లక్కుమారుం గని పుత్రార్థిను లై యందఱు నొక్క పెట్ట వీఁడు మాకొడుకని పలుకుచుఁ గరతలంబుల నెత్త నప్పు డయ్యార్వుఱచన్నులుం జేపిన నద్దారకుండు చంద్రనిభంబు లైనయాననంబు

లాఁచు దాల్చి సప్తమాతృస్తన్యపానం బాచరించిన విస్మయప్రమోదభరిత లై వార లాశిశువు నెప్పటియెడన యునిచి రట్లయ్యగ్నిభవుండు గాంగేయుండును శరజన్ముండును గార్తికేయుండును నయ్యె నయ్యెడకు బృహస్పతి యేతెంచి జాతకర్మాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి పోయెఁ దత్ప్రదేశంబు దనమహానుభావంబున జాతరూపమయం బై యుండు. 176

క. విను మఱి మాఘసుశుద్ధము, నున దగియెడుతపము దనవిహారముగా వ
ర్ధనమొందె ధాత్రి ధాత్రిగ, ఘనరాగమునను శ్రుతులును దనుఁ గొలువంగన్.

వ. ఒక్కనాఁ డక్కుమారునిం జూచువేడుక శివుండు శైలకన్యకయుం దానుఁ బ్రకృష్టబలపరాక్రమంబులు నానాప్రకారవదనశరీరంబులు గలుగు ప్రమథగణంబు గొలువ నరుగుదెంచె నప్పుడు బ్రహ్మవిష్ణులును నింద్రాదిదిక్పాలురును రుద్రాదిత్యమరుద్వసుప్రభృతిసకలసురులును గరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధవిద్యాధరయక్షాదిదివ్యులును మునులును మఱియుఁ బితృదేవతలును ననుచరసమేతు లై యేతెంచిరి మూర్తిమంతంబు లై యోషధిసరిత్సముద్రపర్వతంబులు నరుగుదెంచె నిట్లు నిజదర్శనకౌతుకంబున వచ్చిన యమ్మహాసమూహంబునకు షణ్ముఖుం డై యోగబలాన్వితుం డగునబ్బాలుండు రా నన్నిలగ్రీవుంగను నిరీక్షించి యంతర్ధానంబున. 178

తే. ఉమయు నగ్నియు గంగయు నేనుండ నన్ను, గారవంబున నధికునిఁగాఁ దలంచి
చక్కనాతనిఁ జేరెంచుకొనక్క వీఁడు, సంభృతస్నేహభక్తివిస్రంభుఁడగుచు.

క. అనుచుండఁగ నమ్మువ్వురు, మనమున దచ్చిత్తమున నట్లు తలంపఁగ నది యె
ల్లను దివ్యబోధమునఁ గని, కొని యబ్బాలుండు యోగకుశలత వెలయన్. 180

వ. మూర్తిచతుష్టయంబు దాల్చి యన్నలువురయొద్దకు నేకకాలంబునం జనినం గని యెల్లవారు నద్భుతమగ్నమానసు లైరక్కుమారుండు పదంపడి యొక్కరుం డై పొలిచి నిలిచె నప్పుడు. 181

చ. హరుఁడును గంగయుం శిఖియుఁ నంబికయుం బ్రణిపాతపూర్వని
ర్భరవినయంబుతోడఁ దనకున్ బద్మజుఁ జేరి మహాత్మ యిక్కుమా
రుగుచిరమూర్తికిన్ గుణగుణోన్నత్వవిభూతికి నీవు గాఁగ ని
మ్మరసి యుదాత్తమునఁ బదమున్న నతండు ప్రియం బెలర్పఁగన్. 182

వ. దేవహితపరుం డగుటం జేసి చిత్తంబునఁ దలపోసి వీఁడు దేవసేనకుం బతి యగుంగాక యని నిశ్చయించి వారల వీక్షించి యవ్విధ మెల్లవారును వినం దెలియఁ బలికి శక్రవరుణాదు లగు మేటివేల్పుల నబ్బాలునకుం జూపి వీరు నీకు రక్షణీయు లని యప్పగించె నయ్యమరవరు లక్కుమారు నభిషేకంబు సేయుద మని వారిజాసనుం బురస్కరించుకొని యెల్లవారును దోడన యరుగుదేర సరస్వతీసమీపంబునకుం జని సకలరత్నమయం బైనదివ్యపీఠంబు హిమవంతుండు వెట్ట నం

దాభూతపతిపుత్త్రు నునిచి బృహస్పతి హోమకార్యంబు నిర్వర్తింప నీశానవిష్ణువిధి కౌశికులు లోనుగా నమరముఖ్యు లభిషేకద్రవ్యంబులు సారస్వతజలపూర్ణమణి కనకకలశంబులు ధరియించి గంధర్వాప్సరోగణంబులు సంగీతమంగళం బాచరింప మహామునిప్రకరపుణ్యాహఘోషంబులు సెలంగ నుమాశ్రీసరస్వతీశచీప్రముఖ లైనపుణ్యాంగనలు దీవనలతో సేస లాలుక నభిషేకించి సమ్మోదంబున సేనాధిప త్యంబునకుం బట్టంబు గట్టిరి తొల్లి తత్ప్రదేశంబున దేవతలు జలాధిపత్యంబునకు వరుణు నభిషిక్తుం జేసి రవ్వరుణాభిషేకంబుకంటెఁ గుమారాభిషేకంబొప్పె నప్పా వకసంభవునకుఁ గాముదమనకమలభవశార్ఙ్గిశతముఖప్రముఖు లగుసకలప్రభువులు దమతమయనుచరులయందు రూపగుణబలపరాక్రమాధికు లైనవారి నేఱి భీమ ఘంటాకర్ణసంక్రమదండధరసహితు లగున నేకవీరుల నొసంగి వారల బెరసి వర్తించుటకుఁ దగిన సేనాంగసముదయంబు నమ్మహితాత్మునకు మూలబలంబుగా నొనర్చి రబ్బలంబులఁ జిత్రాభరణవర్మాయుధధరులును వివిధప్రకారాకారులు నగుగజకర్ణనికుంభకుముదాదు లైనసైనికులు మెఱసి యుల్లసిల్లి నమ్మాతృకలతో శత్రుభయంకరంబు లగుచు మాతృకాగణంబులు ప్రభాసిలి విశాలాక్షీపాలితా పురస్సరంబు లై పొలిచె నట్టియెడ. 183

సీ. శంకరుఁ డుదితభాస్కరనిభధ్వజమును, పావనుఁ డనుగవిశోధ్వంసకరణ
పరిణతశక్తియు ♦ హరి బలవర్ధని, యగువనమాలయు ♦ నగజ యొపుడు
మాయని వెలిపట్టు ♦ దోయిని గంగ యుజ్జ్వలసుధామయక మండలువు గురుఁడు
దీప్తదండము వైనతేయుండు మహితమయూరంబు వరుణుం డుదారరూప
తే. మైనతామ్రచూడంబును ♦ నగ్గివిభుఁడు, దర్పితచ్ఛాగమును శతోదళభవుండు
లసితకృష్ణాజినంబును ♦ ననమసమరజయము నొసఁగిరి ప్రీతి నాషణ్ముఖునకు.

వ. ఇట్లు సిద్ధస్వరూపదీపితుం డైనయతని నాపోవక చూచుచు శంకరుండు వీని కీవిభవంబునకు ననాయాసంబున నమరవిరోధినాశంబు గావించుటకు వలయు నని తలంచి భూతమయం బగుమహాసైన్యంబు సమర్పించె నప్పు డింద్రాది బృందారకులు నిజబలసందోహంబులతో నాబర్హివాహనుఁ బరివేష్టించిరి శంఖ భేరీపణవగోముఖప్రముఖతూర్యంబులు దిక్కులు పిక్కటిల్లఁ జెలంగె నట్లు మహాతి యగుదేవసేనకుఁ బతి యై యమ్మహాసేనుండు సురముఖ్యులఁ జూచి మీ కెవ్వరినేనియుం జంపను జెఱుపను వలసియున్నది యట్టిబల్లిదంపుఁబగఱం బరిమార్చెద నని వరం బిచ్చిన వారలు బహుళప్రమోదంబు నొందిరి సేన యార్చినఁ ద్రిలోకంబులు నాదమయంబు లయ్యె నవ్విధంబున విశాఖుని నుత్తమపదస్థునిఁ గావించి విరించివైకుంఠశ్రీకంఠులు నిజేచ్ఛఁ జనిరి పదంపడి యగ్గుహుండు దేవతలు తారకాసురునివలన నలంగి యునికి యెఱింగి. 185

క. బలయుతముగ నడచిన నబ్బలియుండు ననేకదైత్యబలములతో న

గ్గలికి నెదుగు నడచెను ద, న్బలయుగమున కక్కజంపుశోభం డన మయ్యెన్. 186

కుమారస్వామి తారకాఖ్యుం జంపి దేవతలకు ముదంబు సేయుట.

వ. అట్టియెడ. 187

క. తనదారలుఁ దాను దారక, దనుజేంద్రుఁడు గార్తికేయుఁ దాఁకిన నమృతా
శనగణసమ్మదసంపా, దనుఁ డగుచును శక్తి యతఁడు ధరియించె నృపా. 188

వ. అమ్మహనీయసాధనంబున ననేకకోటిశక్తు లుద్భవించి నానాదానవప్రకరంబుల బడలుపడం జేసి యుల్కాసహస్రంబుల పిడుగులతండంబుల మోఁతచందంబున విరావం బొనరించు నది ప్రయోగించి యమ్మహాత్ముండు మహిషత్రిపాదభృత్యోదరు లనుదానుజసేనాపతులం బొలియింప నిలింపసైన్యంబులు సంరంభంబున దైత్యబలంబులం దగటార్చె నక్కుమారుండు ప్రయోగింప నాశక్తి పగతుం బిలుకుమార్చి క్రమ్మఱఁ గరతలంబునకు వచ్చుచుండె నత్తారకుం డట్లు దమవారు సనుటకు సక్రోధుండై యగ్గుహునిఁ గిట్టి పెట్టిదం బగు నతనిశక్త్యస్త్రంబులతాఁకునం బడియె నట్లు జయంబు సేకొని యక్కార్తికేయుండు వెలుఁగ విబుధులు ప్రమోదంబు నొందిరి పదంపడి. 189

క. బలికొడుకు బాణుఁ డనిమిషు, బలమునకుం గిరివల్లభుఁడు బాధించు నమ
ర్త్యులఁ గ్రౌంచపర్వతాశ్రయ, బలిష్ఠుఁ డయి జగములెల్ల భయముం బొందన్.

వ. దాని విని యమ్మహాసేనుండు. 191

మ. కడిమిం బోయి మహాగ్రశక్తినిహతిం గ్రౌంచంబు భేదించి యొ
క్కఁడు గర్వంబున నచ్చి మార్కొనిన దైత్యనాథుఁ దత్సైన్యముం
గడువేగంబున గూల్చె మౌనిసంఘంబుల్ ప్రశంసింపఁ బె
ల్లడరన్ దిగ్గదుందుభిధ్వనులు పుష్పాసార మొప్పారఁగన్. 192

వ. త్రిభువనానందకరుం డై విజయవిభవాతిశయంబున నొప్పి నిఖిలలోకసంభావనీయం బగు నమ్మహాపురుషుచరితంబు లాకర్ణించి కృతార్థుండ నైతి కౌరవాన్వయపావన యాబలదేవుఁ డవ్వృత్తాంతంబు లాలించి విను మతం డత్తీర్థంబునఁ బ్రతిష్ఠితుం డై నకుమారునకుఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి యందలిపెద్దలు కుమారాభిషేకంబు సెప్పఁ జెవులపండువు సేసి. 193

ఆ. అగ్నితీర్థమునకు నరిగి సమ్మోదంబు దాల్చి, యగ్ని డాఁగియున్న నమరు లచటి
కేఁగుదెంచి కాంచి రిద్ధశమీగర్భ, లీనుఁ డై యతని మానవేంద్ర. 194

వ. భృగుశాపంబునం బ్రాపించుసర్వభక్షకత్వంబునకుఁ జాలక దాలంగినయగ్నిదేవు నట్లు గని బ్రహ్మాదిదేవత[1](లమ్మునివచనం బమోఘంబు గావు నీవు సర్వభక్షకుం డయ్యు మాలో నగ్రపూజ్యుండ వని యొడంబఱిచి) నిజస్థానంబులకుం జనుటయు నత్తీర్థంబు పరమపావనం బని తజ్జలంబులఁ గృతస్నాను లై రి యం

(1) ఇది కొన్నిటఁ గానిపింపదు.

దుండి యాసీరి కౌబేరతీర్థంబునకుం జనియె నది కుబేరుండు దపంబు సేసి ధనాధి
పత్యంబు మొదలైనవరంబులు వడసినచోటయ్యెడ గదలి యతండు. 195

ప్రభావతి యనుమునికన్యకమహిమాభివర్ణనము.

సీ. బదరిపాచననామ పరమతీర్థమునకుఁ, జనియె భరద్వాజతనయ తొల్లి
యచటఁ బ్రభావతి యనునది యింద్రుండు, పతిగాఁగఁ గోరి తపంబు సేయ
నతఁడు వసిష్ఠునాకృతి దాల్చి వచ్చిన, నయ్యింతి యర్ఘ్యపాద్యాదు లిచ్చి
భక్తితోఁ జేరి మత్పాణి శక్రున కిచ్చు, దాన నప్పూనికి మానసఁ గాని
తే. వలయుపనిఁ బంపుఁ డన్న న వ్వేలయ నమ్మ
హాత్ముఁ డది యట్ల యగుఁ గాని యతివ వీనిఁ
బక్వములు సేయు మని కొన్ని బదరిఫలము
లానితంబినిచే నిచ్చి యవ్వల నుండ. 196

వ. అదియును గృతస్నానయుఁ గలితధౌతపరిధానయు నై ప్రోయి నగ్ని రాఁజఁబెట్టి యాఫలంబులు జలంబులతోడఁ గూడ నెక్కించి వండుచుండ నవి పాకంబునకు రాకయుండ వెండియుఁ దనసవరించినకాష్ఠంబులు గ్రమంబున నిడి యనలంబు ప్రబలంబు సేయఁ గాష్ఠంబులు సమసెఁ గాని యారేఁగుఁబండ్లరి య వయ్యెఁ గాష్ఠంబులు గలయెడకుం బోయి తెచ్చునంత కగ్ని చూచెనేని దుష్పాకం బగు నని యామగువ తనకా లింధనంబుగా నిడి పాకంబు సేయఁ గనుంగొని పాకశాసనుం డచ్చెరు వొంది ప్రత్యక్షుం బై శుభాంగి నీదునిష్ఠాతిశయంబునకు మెచ్చితి భవదభిమతం బిచ్చితి నీతనువు విడిచి త్రిదివమ్మునకు రమ్ము సర్వపాపహరం బై యాతీర్థంబు లోకత్రయప్రఖ్యాతం బయ్యెడు నని యె నమ్మహాభాగయు నాసుమనోవిభునకు మనోరమ యై నెలసె నట్టిబదరిపాచనంబుననుండి. 197

ఆ. ఇంద్రతీర్థమునకు నేఁగె నాబలభద్రుఁ, డచట నూఱుక్రతువు లాచరించి
యనిమిషేశ్వరుండు గనియె శతక్రతుఁ, డనుప్రసిద్ధితోడ నతులపదము. 198

వ. అచ్చోటు గదలి హలాయుధుండు రామతీర్థంబునకుం బోయెఁ బలుమాఱు రాజుల నెల్లను బొరిగొని పరశురాముం డత్యృప్తుం డై ప్రాయశ్చిత్తంబు గా నయ్యెడఁ గశ్యపునుపదర్శనంబున రాజసూయంబులు నశ్వమేధంబులు వాజపేయంబులు ననేకంబు లొనర్చి యమ్మునీంద్రునకు దక్షిణ సమస్తక్షోణియు నొసంగె నందుండి యయ్యేకకుండలుండు యామునంబునకుం జనియె నది వరుణుండు రాజసూయంబులు సేసినపట్టయ్యధ్వరంబునవసానంబున దేవాసురులకు సకలభూతసంక్షయకరం బగుచున్నసంగరంబు ప్రవర్తించె. 199

ఆ. అచటు గదలి యాతఁ డాదిత్యతీర్థసం, సేవనమున కరిగె ధీవిశాల
యందుఁ గ్రతు వొనర్చి యాదిత్యుఁ డుజ్జ్వల, జ్యోతిషాధిపత్య శోభి యయ్యె.

వ. ద్వైపాయనుండును శుకుండును గృష్ణుండును జైమినియు మఱియును దేవలజై
గీషవ్యాదు లగు నన్యస్థిరు లనేకు లయ్యెడ నద్భుతయోగసిద్ధిం బొందిరి. 201

తే. అచటనుండి సారస్వతాఖ్య మను వసిష్ఠ, తీర్థమున కేఁగె నాబలదేవుఁ డధిప
యందుఁ దొల్లి నిష్ఠాతిశయంబు మెఱయ, దధీచి యనుముని నియమంబు లాచరించె.

వ. ఆనియమాచరణంబునకు నింద్రుండు శంకించి తద్విఘ్నకరణంబునకు నలంబుస
యను నప్సరోవనితం బుత్తెంచినఁ దదీయదర్శనంబున నమ్మునివీర్యంబు స్ఖలించిన
దాని సరస్వతి గర్భంబుగాఁ ధరియించి పుత్త్రుం గాంచి తపస్విజనగోష్ఠి నున్న
యత్తపోధనునకడకుఁ దెచ్చి నీయందు నీకొడుకు భవత్తేజంబు వృథ వోనీక యేను
వహించి కాంచితి నీనిం గైకొను మనిన నతండు వాని నెత్తికొని యాలింగనం
బును మూర్ధాఘ్రాణంబును జేసి యాసరిద్వరి నాలోకించి నీవు బ్రహ్మసరస్సున
జనియించితి పుణ్యనదులయందు నుత్తమ వని సంస్తుతించి నీజలంబులం దర్ప
ణంబు సేసిన విశ్వేదేవతలుఁ బితరులు గంధర్వులుఁ దృప్తు లౌదు రని యను
గ్రహించి యిక్కుమారుండు నీ పేర సారస్వతుం డనం బరఁగుఁ బదంపడి పండ్రెం
డేం డ్లనావృష్టి యగు నయ్యవసరంబునం బెక్కండ్రు మునుల రక్షించి
వేదాధ్యయనంబు సేయించు నని చెప్పి యొప్పగించిన సరస్వతి ప్రీత యై తన
యుం గొని చనియె నాకాలంబున. 203

క. అమరులకు నసురులకుఁ గల, హవము గలిగిన బలవిరోధి యాయుధనికురుం
బము నవరించుటనుసారోద్యోగ, మునఁ బ్రవర్తించె వీరకౌతుక మలరన్. 204

వ. అట్లుద్యోగించి. 205

చ. జగముల నందునుం బడయఁ జాల కతండు దధీచియస్థులం
దగియెడు నాయుధంబు లగుఁ దప్పిరతం జని వేఁడ నాతఁ డి
చ్చు గురుతరాతిదయాజ్వలయుక్తోసిరతుం డని పంపఁగా నిలిం
పగణము వోయి వేఁడిన స్వకీయ ళికలు యిచ్చె నతండు ప్రీతితోన్. 206

వ. ఇచ్చి యతం డవ్యయలోకంబునకు నరిగె నమరవరుండును దదస్థుల వజ్రా
యుధంబు నొనర్చి యేర్చె నంత నాసారస్వతుండు ద్వాదశవార్షికం బగున
నావృష్టిదురితంబునఁ దన్నుం జేరి పిన్న యనక విద్యావిశేషకలితం బైన గౌర
వంబున శిష్యత్వంబు భజియించిన యఱువదివేవురు మునుల సరస్వతీప్రభావ
జనితం బగు నన్నంబున రక్షించుచు వేదంబుఁ జదివించె నాసారస్వతతీర్థంబున
నుండి యాసంకర్షణుండు వృద్ధకన్యాశ్రమంబునకుం బోయె నయ్యెడ గర్గవంశ
వర్యుం డగు కుణి యను తపోధనుండు. 207

సీ. పరమతపమున నొకకన్యకం బడసి పెంచి, దివమునకు నేఁగె నది తపస్స్థిరతఁ బూని
పతి వరింపంగ నొల్లక బ్రహ్మచర్య, మున వెలింగి యయ్యాశ్రమమున వసించె.
పదంపడి యత్యంతవృద్ధ యై పరలోకగమనంబు గోరె నప్పుడు యదృచ్ఛాధన్ని

హితుండై ననారదుం డక్కన్యక కిట్లనియె. 209

క. విను పాణిగ్రహణము సే, యనివనితకుఁ బుణ్యలోకము ప్రాప్యము గా
వున నేయుపాయమున నై, నను దగియెడువరు వరింపు నలినదళాక్షీ. 210

ఆ. అనిన నిజతపంబు నర్ధంబు లంచంబు, గాఁగ నిచ్చి యదియు గాలవాత్మ
జుని వరించె నతఁడు సుదతితో సమయంబు, పలికికొనియె ధరణిపాలవర్య. 211

వ. సమయంబు నేకరాత్రసహవాససమ్మతికలితం బట్లు పాణిగ్రహణసంస్కారవతి యై యావృద్ధకన్యక దైవయోగంబున నారాత్రి మనోహరయౌవనయుఁ బరమానులేపనమాల్యాంబరభూషణాభిరామయు నయ్యె నమ్మునియుఁ బ్రీతుండై యన్నాతిసంగతి నన్నిసి గడపెఁ బ్రభాతంబున నన్నితంబిని యతనికిట్లనియె.

తే. ఒక్కరేయి నీపాల నాయునికి గాఁగఁ, బలికికొన్నార మది సెల్లె నలఘుచరిత
పోయి వచ్చెదనని దివంబునకుఁ బోవ, నుత్సహించె నమ్ముని మది నుమ్మలింప.

వ. ఇట్లుత్సహించి యిత్తీర్థంబున దేవఋషిపితృతర్పణపరుండై యొక్కనాఁ డుపవసించినవాఁడు పంచాశద్వత్సరపరిపూరణీయం బగు నైష్ఠికబ్రహ్మచర్యఫలంబు వడయువాఁ డని పలికి తనువు విడిచి దివంబున కరిగెఁ గురువంశోత్తమా యయ్యెడ నా రేవతీపతి శల్యుండు రణంబునఁ బాండవులచేత నిహతుం డగుట విని వగచుచు నచ్చటికిఁ జేరువ యగుశమంతపంచకంబునకుం జని యందుల మునులఁ గురుక్షేత్ర విశేషంబు లడిగిన వార లతనికి నది ప్రజాపతియుత్తరవేది యనియును సమస్తదేవతలు నందు వరిష్ఠంబు లగుసత్త్రంబు లాచరించి రనియును దానిఁ గురుం డనురాజు దున్నుటం జేసి దానికిఁ గురుక్షేత్రం బను నామంబు గలిగె ననియు నెఱింగించిన నయ్యేకకుండలుం డాభూమీశ్వరుఁ డేమి ప్రయోజనంబునకు దున్నె ననుటయు నాతపోధను లిట్లనిరి. 214

## కురుక్షేత్రప్రభావాభివర్ణనము.

సీ. ఇందుఁ బుట్టినజను లెల్లను దుదిఁ ద్రిది, వంబున కరుగంగ వలయు నని మ
నంబునఁ గోరి యన్నరపతి దున్నంగ, నింద్రుఁడు సనుదెంచి యేల యిచట
దునియెద వనిన నమ్మనుజాధిపతి తన, కోర్కి సెప్పిన గేలిగొనుచుఁ జనియెఁ
బలుమఱు నద్దేవపతి వచ్చి వెండియు, నుల్లస మాడుచు నుండు[1] నతని

ఆ. నతఁడు నిష్ఠ గుందక నిశంబు దున్నంగ, వరముఁ బ్రీతి నొసఁగువాఁడు గాఁగ
నమరు లెఱుఁగ నిశ్చయము సేసి యాశక్రుఁ, డచటి కేఁగుదెంచి యతనితోడ.

వ. ఈపుణ్యక్షేత్రంబున నిరాహారులై దేహంబు విడిచినవారలకును నిందు సమరంబు సేసి సమ్యక్ప్రకారంబున మృతిఁ బొందినసమస్తజంతువులకు సురలోకప్రాప్తి గలిగెడు మని పల్కి నిజస్థానంబునకుం జనియె నట్లు చను చుండి యాశతమఖుఁడు సంభావనాతిశయంబున. 216

1 నతఁడుఁ, దనదునిష్ఠ.

క. గాలిం గురుక్షేత్రంబున, ధూళి తనువుం జెంది నరునికి దుష్కర్మములం
దోలి యతనికి ధరిత్రిం, దూలి [1]మధురలీల మైనకతులగతి యొసంగున్. 217

వ. అని నిర్దేశించినం గురునృపాలుండును గృతకృత్యుండనై సంతోషించె నని చెప్పుటయు నాప్రలంబవైరి ప్రమోదభరితుం డగుచు మెలంగి యశ్వత్థమధూకామ్ర బిల్వాదిభూరుహశోభితం బైన నిజపూర్వాశ్రమంబుం గనుంగొని యిది యెవ్వరియాశ్రమం బని యడిగిన నమ్మును లిమ్మెడం దొల్లి విష్ణుదేవుండు దపంబు సేసినచోటు మఱియు శాండిల్యప్రభృతు లిందు యోగసిద్ధిం బొందిరనిన విని యయ్యాశ్రమంబుం గొనియాడి తత్ప్రదేశంబున బహిఃపరివారంబు నెల్ల విడిసి కొల్పి యొక్కపుణ్యాచలం బెక్కి దానితటంబున సమస్థలంబున మునిజనసహితంబుగ నాసీనుం డయ్యె నాసమయంబున నచ్చటికి జటామండలకలితుండును [2]కుశచీరచ్ఛాదితాంగుండును గలహప్రియుండును నగు నారదుండు హేమదండంబును మణికమండలువును గచ్ఛపవీణయుం బొలుపు మిగుల నేతెంచిన నెల్లవారలుం బ్రత్యుత్థానప్రణామంబు లాచరించి సుఖోపవిష్టుం జేసి పరివేష్టించి రా దేవమునిం గొల్చియుండి యబ్బలదేవుండు. 218

క. కురువృత్తాంతం బడిగినఁ, గని మేల్పడఁ జెప్పె నతఁడు గాంగేయుండున్
గురుఁడును గర్ణుండు శల్యుఁడు, వరుస ననిం దెగుట కౌరవక్షితినాథా. 219

వ. మఱియును మృగాసుల సన్నృపకుమారాదియోధవీరులం జెప్పి పదునెనిమిదిదివసంబులం జెల్లినసంగరంబు తెఱంగును సంక్షేపరూపంబునం దెలియం బలికి దుర్యోధనసైన్యం బంతయు సమయుటయు నందుం గృపాశ్వత్థామకృతవర్మలు బ్రదికిపోవుటయు నన్నరపాలుం డోడి పాఱి ద్వైపాయనహ్రదంబు సొచ్చి జలంబుల నంస్తంభించి డాఁగుటయు నది పాండవు లెఱింగి సపరివారంబుగం జనుదెంచి యమ్మడువుఁ జుట్టుముట్టి పెట్టిదంపుమాట లాడుటయు దానం గనలి యమ్మనుజవరుండు మడుఁగు వెడలివచ్చుటయు నెఱింగించి బిరుదుమగ లగుపగతుర పెక్కండ్రు పొదివికొని యుండం గురుపతియు నుక్కు దక్కక యున్నవాఁ డద్దండితనంబుఁ జూచిన మెత్తు నీ వని యుగ్గడించి. 220

చ. అతనికి భీమసేనునకు నాహవ మయ్యెడు నొంటిమై మహో
ద్ధృతబలశౌర్యదర్పయుతులౌ బాల్చు భవత్ప్రియశిష్యులర్ సుశి
క్షితులఁ గనుంగొనం దలఁపు చిత్తమునర్ మొలతెంచునేనిఁ బో
మ్మతులగదాకృతోజ్జ్వలవిహారము దారనిరూఢి నొప్పెడున్. 221

వ. అనిన విని యమ్మునీంద్రునిం దక్కటిమునులను వీడ్కొని యచలంబు డిగ్గి యభ్యంతరపరిజనంబుల నిజపురంబున కనిచి యన్నీలాంబరుం డరదంబు సమీపంబునకుం జని సరస్వతి నాలోకించి. 222

1 యమరలీలమై. 2 కనకకాంతినిభ.

చ. అరయఁగ మేటిపుణ్యనదులందు సరస్వతి సౌఖ్యసంపదల్
నరులకుఁ గల్గు నిజ్జగమునం బరలోకమునందు నీసరి
ద్వర నొకనాఁడు సేరినను వాసవముఖ్యసమస్తదేవతా
వరులును నిందు మేల్ నడయ వత్తురు సంస్కృతి సాలు సిద్ధికిన్. 223

తే. అనుచుఁ బలుమాఱుఁ జూచుచు నధికభక్తి మోడ్పుఁ గేలుఁ గంబున మోపికొనుచుఁ
బుణ్యతమనిజమూర్తివిస్ఫూర్తి మెఱయ, నమ్మురారాతిపూర్వజుఁ డరద మెక్కి.

వ. అతిత్వరితగమనంబున ద్వైపాయనహ్రదంబునకుఁ జనుదెంచె నయ్యెడ. 225

తే. ధర్మపుత్త్రాదులును సుయోధనుఁడు నతనిఁ
గన్న తెఱఁ గాంబికేయుండు విన్న తెఱఁగు
నధిప మును చెప్పినాఁడ నట్లన్నరేంద్ర
కుంజరుఁడు విని యిట్లను సంజయునకు. 226

పాండవదుర్యోధనులు ద్వైపాయనహ్రదంబు విడిచి పాలికలకుఁ బోవుట.

క. బలభద్రుఁడు సనుదెంచిన, నలఘుగదాస్ఫురితభుజసహాయోర్వసము
జ్జ్వలుఁ డగుమత్పుత్త్రునకుం, దెలివి మిగుల కున్నె నాసుతుతెఱఁ గెట్లయ్యెన్.

క. అనుటయు నతఁ డిట్లను న, జ్జనపతికి హలాయుధుండు సనుదెంచిన ని
మ్మనము దెలివొందె మూఁపులు, దనరె మొగం బలరె నీదుతనయున కధిపా.

వ. ఇట్లు ప్రీతుండై యాతండు ధర్మనందనుం జూచి శమంతపంచకంబు ప్రజాపతియుత్తరవేది యనఁ బ్రసిద్ధం బైనపుణ్యస్థలం బయ్యెడం బ్రధనంబున నిధనంబు నొందినవారికి సద్గతి యగుట ధ్రువం బని విందు మప్పటిపాలికలనికిం బోవుద మనిన నతం డాద్వైపాయనహ్రదం బాసీమలోనిది గామి యెఱుంగుం గావున నమ్మాట కియ్యకొని తదభిముఖుండై పోవ నాదుర్యోధనుండును గదాకలనంబున నంసపీఠంబు పొలుపార మత్తగజేంద్రయానంబున సమరప్రస్థాయమానుం డగుచుం జన శంఖభేరీప్రముఖతూర్యస్వనంబులు సెలంగె నిట్లు పాండవపరివృతుండై యచటికిఁ గొడుకు నడచి యమర్షసముజ్జ్వలుండై. 229

క. నిలిచిన సకలజనులు నెడ, గలసి బలసి నిలిచి రపుడు గదయుఁ బసిఁడిగ
త్తళము మెఱయ నతనియెదురఁ, జెలువొందె బకారి హేమశిఖరియుఁ బోలెన్.

చ. కనుఁగొని దర్పమంథరముగా నతఁ డిట్లనుఁ బాండవాగ్రజ
న్మునకు వడిం బెనంగఁగ నను బవనాత్మజుఁ జూచుచేడ్క నీ
జనతతి యంత కంత కిటు సందడి గాఁ దనయిచ్చఁ గ్రమ్మదెం
చునొ యుపవేశనిశ్చలతఁ జూచిన మేలఖిలప్రియంబుగన్. 231

వ. అని భూపాలుర నెల్ల నాలోకించినం బాంచాలాదు లగునయ్యందఱును ధర్మనందనుండు గూర్చుండ నియోగించి బలదేవవాసుదేవసహితంబుగఁ దాను నాసీనుం డయ్యె నమ్మహీనాథమండలంబున సితప్రభుం డై నయన్నీలాంబరుండు

త్తెఱఁగునకు నియ్యకొని చూపఱు వొగడఁగ నిన్ను నిపుడు పడవైచుటకున్.

తే. అమరి యున్నాఁడ నాహారి కగ్గమైతి, పదుదుగా కింక నీకు [1]నెక్కడకుఁ బోవ
వచ్చు ననవుడు నిది యేల పెచ్చుపెరిఁగి, యాల మెడసేసి యనిలజ ప్రేలె దిట్లు.

వ. అని కురువిభుండు వెండియు నిట్లనియె. 246

క. పలుకుల వెఱపించెద వా, కొలఁదియె దుర్యోధనుం డకుంఠితబాహా
బలుఁ డిదె యవలీల నినుం, బొలియించెడిఁ బలుకు లుడిగి పోరాడు ధృతిన్.

శా. వ్యూహాభావము సూచి న[2]న్నసదుగా నూహించె దో భీమ మ
ద్బాహాచండిమసారదుర్దమగదాదండంబు దృప్యద్భవ
ద్దేహోల్లాసము నెట్లు దీనదశకుం దే నోపునో చూడుమీ
యాహా పుట్టెడు లాఁతిచూపఱకు హాహా పుట్టు మీవారికిన్. 248

ఉ. నా కెదురై పినాకియుఁ బినాకము పట్టక యుద్ధతిన్ గదా
భీకరవృత్తి చూపుటకుఁ బేర్చిన నెక్కుడు పేర్చి చీరికిం
గైకొన కే పడంచి భుజగర్వసమున్నతి నిర్వహింతు నీ
[3]కేకడ డాఁగ వచ్చు గద నే నని సేయుటకుం గడంగినన్. 249

వ. అని మఱియును. 250

క. గదఁ గయ్య మెన్నఁడొకో చే, యుదు భీమునితోడ ననుచు నుల్లంబునఁ గో
రుదు నెప్పుడు నిప్పుడు నా, కది యొదవెన్ విధికృతిం గృతార్థుఁడ నైతిన్.

వ. నీ విట చక్కనయి రమ్ము. 252

చ. అన విని యెల్లవారు భవదాత్మజు మెచ్చి నుతించి రయ్యశో
ధనుఁ డరివీరు లట్లు ప్రథితంబుగఁ దన్ బొగడం బ్రమోదియై
వినుచుఁ బ్రవర్ధితం బయిన వీరగుణంబున నుల్లసిల్లె నా
తనిపయి భీముఁ డుద్యతగదాస్ఫురణన్ నడచెన్ నరేశ్వరా. 253

వ. అప్పుడు కుంజరబృంహితంబులును హయహేషలునుం జెలఁగె నిట్లు తనమీఁద నడచువడిముడిం జూచి నీకొడుకు కదల్చుచు గదాసముల్లాసంబు భాసమానంబుగ వీఁక నెదుర్కొని తాఁకిన. 254

భీమసేనదుర్యోధనుల గదాయుద్ధము.

సీ. చండగదాపరస్పరఘట్టనంబుల, మింటఁ బెల్లడరెడు మంటగములఁ
బరమఘోరము లగుపదతాడనంబుల, నొలయువసుంధరాచలనములను
నుద్భటక్రోధసముద్రేకములఁ జూడ్కు, లం దులసిల్లెడు నరుణరుచుల
దారుణధ్వను లగుతర్జనలీలలఁ, బరఁగుపర్వతగుహాప్రతిరవముల

తే. ననిమిషులదృష్టి మిఱుమిట్లు గొనఁగ భుజగ
పతియుఁ గూర్మంబు సంకటపడఁగఁ దరణి

1 నెక్కడికిఁ. 2 న్నసుదుగా. 3 కేకడ కేఁగ.

నుద్రిక్తం బగునాత్మరక్తమున మఱిగోన్మగ్నతం బొల్చి త
ద్గదూర్ధ్వాగ్ర గదాయుగంబు విసరత్సంధ్యాంబుదద్వంద్వభా
స్వద్రేఖాలలితంబు చెన్నునడ సెన్ వారిద్దఱుం బోరఁగన్. 264

క. సుర లచ్చెరువును మెచ్చును, బెరిగొను చిత్తములతోడఁ బెద్దయుఁ బ్రొద్ద
య్యిరువుర గెలుపోటమి తెలియఁ, గరసి నిరూపింప నేరరైరి నరేంద్రా. 265

తే. అప్పు డప్పుడ తలపడికొనట్టు లప్పు, డేచి విలసిల్లు నేనులకియెఱ్ఱచెలువు
గలయఁ బూఁటనడమ్రోదుకిపులఁ దలఁపఁ, బట్టుగా నొప్పె నఘన నీకపట్టిదోయి.

వ. ఇవ్విధంబున నొండొరులకు వట్రపడక యసమానమగుచు సాటోపసంరంభం బులం బెనంగి రందు గాంధారీనందనుండు వలపలించి చుట్టుకొని రా నది సరకుసేయక బకవైరి దాపలించి తిరిగినం బెరిగినయాసంబున నుల్లసి తుం డై యాభూవల్లభుండు నిబిడియెనుక లగల త్రేసిన నవ్వెగుం డక్కౌ రవపతికంబుతో నగ్గద బీఱువోవ త్రేయం బాయక మగుడం బూన్చి సారించినం దోరంపు మెఱుంగు లెసంగం జెలంగి శబ్దంబులు నింగి ముట్ట బెట్టి దంబు గఁ దా వెనువునం దిరిగి యద్ధరణీశుండు శిరస్త్రాణంబు సిసెంజేసినం గౌంతేయుండు గంపింపమి యక్కజం బై యుండె నంత నగ్గలం బగునలుక నవ్వడముడి పుడమితేనివెడందయురం బులక్షించి లాఘవఘోరంబుగ గదాదండంబు ద్రిప్పి వైవ నాతం డది మేనినునులునం దప్పింప నది యిల చలింపం బడిన నన్నుసులు తెఱపిన యుఱికి యుద్భూతవేగం డగునవ్వాయు పుత్రుండు గద పుచ్చుకొని తిరుగునందున దుర్యోధనుండు తనిమానవక్షస్థలంబు దారుణప్రహారంబున నొప్పించిన నతండు నండినసంచాలురచి త్రాంబులు దూల సోలియు నాలోనన తెలివొంది బలవిక్రమంబులు మెఱయ నమ్మనుజపతి పార్శ్వ భాగంబు బెట్టడిచిన మ్రానిరిల బడియును వీఁక చెదక యెగసి యజ్జగతిపతి తన్ను నగుచు నార్చుపగతురు సిగ్గుపడ నగ్గలికసొంపు పొంపిరివోనఁ బవన తనయుఫాలకర్ణమధ్యప్రదేశంబు పటుప్రహతిం బగిల్చిన నొల్లబోయి శీఘ్రం బునం దేఱి యమ్మహాబలనందనుండు గండతలంబునం దొరఁగునెత్తురనుమదం బున మత్తకరి ననుకరించుచుఁ దుండంబుచందంబునం జెలువొందుగద యల్లార్చి పేర్చి వ్రేటుగొనిన మొదకెలను దాఁకి నీకొడుకు మహాపవనపతితం బగుసాలంబుపోలికిం గూలినం గని ధర్మపుత్రప్రముఖులు ప్రమోదంబు నొం దిరి గ్రక్కున లేచి కాలాకారుం డై ధాత్రీనాథుండు చిత్రభ్రమణంబుల వెగడుపఱిచి పలువ్రేటుల నొప్పించినం గిమ్మీరవైరి వసుధం ద్రెళ్లుటయు నది సావుగాఁ గొని యక్కురుసింహుండు సింహనాదంబు సేయ నవ్వాయుసుతుండు సావమి యెఱింగి యాభూపతి పెనంగుభంగియుఁ గనుంగొని మెచ్చునుర ప్రకరం బులు పుష్పవర్షంబులు గురియం బరులకు భయం బొలసె నంతం దెలిసి భీమసే

నిక్కులపాంసనునిం బిలుకుమార్పకున్న నింక నించుకసేపునకుం దాన తెగం
దెగిన మీకు నెల్ల నిప్పాపాత్ముండు రాజగుట కోర్వవచ్చునే యనుటయు. 271

క. విని క్రీడి యపుడు మారుతతనయుండు దనుం జూడ నూరుతలను కరతలం
బున నప్పళించె నతండును, గనికొనియెను సన్న యగుటం గౌరవముఖ్యా.

వ. కనికొని యధర్మంబైన నూరుభంగంబు సేయుమని కృష్ణానుమతి
జిష్ణుండు వనిచె నాకు నొండుమెయి నెట్లునుం బగతునగపాటు లేక తక్కనే
నవ్విధం బాచరింతునకాక యని మనంబున నిశ్చయించి వివిధగతులం జరి
యింపం గురుపతియు బాహుచిత్రప్రచారంబుల నుల్లసిల్లం బిత్సంగ్రామం
బామిషార్థిగరుడద్వయసమరంబుచందంబున దర్శనీయంబై యుండె నట్టియెడ.

ఆ. పాండురాజసుతుండు పటుతరోల్లాసియై, వైచుటయును ధరణీవల్లభుండు
తొలంగ దాటె రయమునఁ దలకొనిగదఁ బుచ్చి, కొనియె నాబకాంతకుండు నుఱికి.

దుర్యోధనుండు భీముగదాదండమునం దొడలు విఱిగి పడుట.

క. ఆలోనం గురుధరణీ, పాలుం [2]డడరి ప్రేయుటయును బవనసుతుని నె
సోలె నది గానం డాపతి, కేలీవిభ్రమము దోంప గ్రేళ్లుఱికె నృపా. 275

చ. ఉఱికినఁ దేఱి పై కుఱికి యుగ్రత భీముఁడు ప్రేయ నవ్విభుం
డుఱక మహాద్భుతస్ఫురణ నూర్ధ్వపరిభ్రమణంబు సేసినం
దెఱపి యతండు గాంచి సముదీర్ణరయంబున వైచెఁ బెన్గదల్
విఱిగి నగాగ్ర ముద్భటపవిప్రహతిం బడుచాడ్పునం బడన్. 276

వ. అప్పుడు మహోల్కాపాతంబులును బాంసుమాంసరక్తవర్షంబులును వికృ
తంబులగుకరితురగబృంహితహేషాఘోషంబులును మఱియు ననేకోత్పా
తంబులును గలిగిన నట్లు కౌరవపతిపడుటకు నుబ్బసం బొదలినపాంచాలురుం
బాండవులు నుద్విగ్నచిత్తులైరి వియత్తలం బంతయు నొక్కమ్రోఁతగా
నగ్గదాయుద్ధవిశేషంబు లగ్గించుచు సురగరుడఖచరాదులు నిజస్థానంబు
లకుం జని రిట్లు తనగదతాఁకునం దొడలు విఱిగి సింగంబుచేతం గూలిన
గంధశుండాలంబుచందంబునం బడి యున్నసీకోడుకుం జేరం జని భీమసేనుండు.

తే. ఏకవస్త్రం బాంచాలి నట్లీడ్చి తేరం
బనిచి సభలోనం బఱిచిన పాపఫలము
ననుభవింపుము దుష్టాత్మ యనుచు వామ
చరణమున బెట్టిదము గాంగ శిరము దన్నె. 278

వ. తన్ని యలుక మలుగక యతనియాననం బాలోకించి. 279

క. పసు లని యార్చుచు మము ను, ల్లస మాడినధర్మహీనులను నృపధర్మం
బెసంగంగ నే మిదె యిప్పుడు, పసు లని యార్చెదము మగుడ బంధుద్రోహీ.

1 తలఁగ దాఁటె రయము దళుకొత్త గద. 2 డు గద వ్రే.

చ. అనిలసుతుం డధర్మమున నమ్మెయిఁ గౌరవమేదినీశ్వరుం
దనయెదురన్ వధింపఁగ గదాసమరాఖిలధర్మవేది నాఁ
జనినహలాయుధుండు గని సంజయ యేమని పల్కె నంత వాఁ
డనుజులకున్ మఱందులకు నట్టియెడ న్వగమోడ నేర్చునే. 293

చ. అనవుడు నాతఁ డిట్టు లను నమ్మనుజేంద్రున కట్లు రోహిణీ
తనయుఁడు కోపవేగమునఁ దామ్రముఖుం డయి లేచి బాహువు లె
త్తి నృపతులార చూచితిరె తెల్లముగా బకవైరివిక్రమం
బున తెఱఁ గిట్టివాని మనభూములఁ గంటిమె యెన్నఁ డేనియున్. 294

వ. గదాయుద్ధంబున నాభికి దిగువ యగుశరీరభాగంబు నొప్పించుట ధర్మంబు గా
దనుశాస్త్రోక్తి వినమె వీఁడు విచ్చలవిడిఁ జంపె నని యని పలుకునమ్మహాత్ముని
మనంబున రోషానలంబు సముత్థితం బగుటయు నప్పుడు. 295

క. నిజరథముఖోఁదివాలమును, భుజశిఖరమునం దమర్చి భూమి యుద్రున వా
యుజు దెసకు నడచె నుద్భట, గజరిపుచంక్రమణరేఖ గతియం దోలయన్. 296

శ్రీకృష్ణుఁడు బలరామునకుఁ గోపోపశమనంబు సేయుట.

వ. దానికిం బవమానసూనుండు సోదరభుజబలనిజబలంబు లేకముఖత్వంబున
నెప్పుడుం గలుగుమనోబలంబునలనం జలింప కుండ నట్టియెడ వేగంబ విన
యావనతుం డగుచు నచ్యుతుం డష్టంబు సాచ్చి దీర్ఘసృత్తపీనంబు లగు బాహు
వుల హలాయుధుఁ బట్టి కైలాసశైలంబు గదిసినయంజనమహీధరంబునాడ్కి
నొప్పి యనూనస్వరంబున నతని కిట్లనియె. 297

క. తనవృద్ధియు మిత్త్రునివృద్ధనమును దత్సఖసమృద్ధి ప్రబలంబయును శ
త్త్రునిదెస నిన్నియుఁ జెడుటయు, ననుషడ్విధములను నన్న సతి శుభ మొందున్.

వ. ఏతత్ప్రకారంబు విపరీతం బగుట యొప్ప దట్లు గావున మిత్త్రునకుం గీడు వాటిల్లి
నెడ నేర్పు గలుగునేని మైత్రిపరుం డయినపౌరుషశాలి యాతని శమింపం జేయు
సత్యపరాక్రము లగుపాండవులు మనకుఁ బరమమిత్త్రులు విశేషించి మనమే
నత్తకొడుకు లనీతిపరులచేతం బరిభవింపంబడినవారు గావున వీరల కభ్యుద
యంబు గలిగించుట నీకుం గర్తవ్యంబు. 299

తే. ప్రతిన నెఱపుట నృపులకుఁ బరమధర్మ
మగుట మనమునఁ జర్చింపు మనిలసుతుఁడు
గద సుయోధనుతొడలు భగ్నములు సేయు
వాఁడు గా సభఁ బూనినవాఁడు గాఁడె. 300

వ. అట్లు గాక మైత్రేయమహాముని శాపంబున దుర్యోధనుతొడలు భీమసేనుగదా
ఘాతంబున భగ్నంబులు గాఁ గలయవి యై యుండె నిప్పు డట్లయ్యెం గావున

దీన దోషంబు దోఁపదు క్రోధం బుపసంహరింపుము కుంతీనందనులయభివృద్ధి మనకు సమృద్ధిఁ జేయు ననిన నతనికి హలాయుధుం డిట్లనియె. 301

తే. ఒపి ధర్మార్థకామంబు లొకటి నొకటి, నాశ మొందింప కుండంగ నడపవలయుఁ
గాక ధర్మంబు సెడ నర్థకామములను, గోరుపురుషుండు నిందకుఁ గుదురు గాఁడె.

క. మునిశాపంబును బ్రతినయు, నని చెప్పితి గలుగుఁ గాక యవి విను ధర్మం
బునవానికి నెఱపక యి, ట్లనిలసుతుఁడు గలఁచెఁ గాదె యన్నీతి యెల్లన్.

చ. అన విని కృష్ణుఁ డిట్టు లను నాతనికిన్ విను నిజ్జగంబు ధ
ర్మనిరతమానసుండు మధురత్వనిగూఢుఁడు రోషదూరుఁ డం
చనిశము సంస్తుతించును మహాత్ము యుడంపుము క్రోధ మీతఁడుం
దనదు ప్రతిజ్ఞ దీర్చ రిపు గదాహతుఁ జేసె సధర్మమే లగున్. 304

వ. అదియును నిలిచి మహాస్త్రయస్తుఁడును నడచు నడను గాదు పొడ వెగసి పై కుఱికినఁ దన్నుం గాచికొనుటయుం బ్రతిన నెఱపుటయును గారణముగా దొరకొనిన నాభికి దిగువ గదా యని యుఱికి చావ వచ్చునే గద నూరుభంగంబు సేయుదు ననుభీముసేనుపూనికి పదుమూఁడువత్సరంబు లేని వేఁచినయది[1] యిక్కులపాంసనుం డెల తలంప కుండెడి మఱచె నేనిం జెడుఁ గాక మన కేమి కలియుగంబు వొడమ యాసన్నం బయ్యె నివ్విధంబులు ధర్మంబులై చెల్లకుండునే యట్లుం గాక పుట్టినదాదిగ నుండియుం గపటంబున నపకారంబులు సేయుచున్నవీనిఁ గపటప్రకారంబునం బడవైచుట ధర్మహాని యై తోఁపదు వీఁడు పాండవయావదవస్థానుం డగుసుభద్రానందనుం డగటార్చిన తెఱం గెఱుంగమే యనిన నాబలదేవుండు నలుమొగంబుతో నిట్టిచెనఁటిగెలుపు గెలిచిన భీముండు నృశంసుఁ డగుం గాక రణధర్మంబు దప్పక పెనంగినట్టిధర్మాత్ముం డైనదుర్యోధనుఁడు సుస్థలోకం బయ్యెడు మనుచు నతనికిం జెప్పి రథాధిరూఢుం డై పాండవసేనాపాంచాలయదుప్రవరులు చిన్నంబోవ నిజపురంబునకరిగెఁ దదనంతరంబ వాసుదేవుండు ధర్మపుత్త్రు నాలోకించు నెడ నతండు దీనాననంబుతోడ నూహసంబు విషాదంబు నొంద నూరకున్న నారాయణుం డతని కిట్లనియె. 305

ఆ. బంధునాశకుండు పాపాత్ముఁ డీసుయో, ధనుఁడు వీని సమరధరణిఁ గూల్చి
శిరము దన్నె భీముఁ డగుయంగ నిది యధర్మంబె నీకు నేల కుఱుంగఁ జెపుమ

వ. తలఁ దన్నువాఁడ నను ప్రతిజ్ఞయుఁ గీచకారాతికిం గలదు గాదె యనిన విని కుంతీనందనుండు దేవకీనందనున కిట్లనియె. 307

క. కురుకులము వ్రాలియుటకు నుది, యొరియుంగా నున్ననాకు నితఁ డీరాజ్యా
శిర ముఱక తన్ని యిమ్మెయిఁ, బరిభవ మొందింప వగపు పాటిల కున్నే.

1. పూఁచినయది.

తే. ఇతఁడు వఱిచినపాటులు హృదయకీలి, తంబులై భీమసేనుండు తగవు మాలె
నేమి సేయంగవచ్చుఁ బో నిమ్ము పుణ్య,పాపచింత యిం కేటికిఁ బద్మనాభ.

వ. అనుటయు నట్లు కాక దీని నింత గొనియాడ నేల యని యతండు భీమసేనపక్ష
పాతంబున నతనిచింత గీటునంబుచ్చె బీభత్సుండును నెఱియం బ్రియం బందని
డెందంబుతోఁ గీడు మేలాడక యూరకుండె నమ్మారుతి మోదం బెసఁగ
మోడ్పుఁగేలు ఫాలతలంబున మోపికొనుచు నుత్ఫుల్లంబు లగులోచనంబుల
నొప్పి నిజాగ్రజుం జేరం జని యిట్లనియె. 310

చ. పరిభవకారి యైనకులపాంసనుఁ డాహవభూమిఁ గూలెఁ ద
త్పరనుతి వైరముం బెనిచి పాపవినిశ్చయకారకత్వని
ష్ఠురు లగుదుస్ససేనుఁడును సూతసుతుండును సౌబలుండునుం ద్రుం
గి రితనికంటె మున్న మహిలోకిం బతి నీవ భరింపు ముర్వితిన్. 311

వ. అనిన విని ధర్మతనయుం డనని కిట్లనియె. 312

క. హరితలఁపు గూడఁ గురుపతిఁ, బరిమార్చితి ప్రతిన తోడఁ బగ దీర్చితి నీ
కరయంగ దైవబలవి, స్ఫురితభుజాబలము లింత చొప్పడి యున్నే. 313

వ. అని సంభావించె ననిన విని యాంబికేయుండు సంజయు నుద్దేశించి. 314

తే. అట్లు వడియున్నయక్కౌరవాధినాథుఁ, జూచి పాండుసూనులు సోమకులును
నేమి సేసిరి నాకది యెఱుఁగఁ జెప్పు, మనుఁడు నతఁ డిట్లులనియె నమ్మనుజపతికి.

వ. దేవా యేమి సెప్పుదుఁ బాండవులును బాంచాలురుం దక్కటిభూపతులును
కృష్ణసహితంబుగా నుబ్బునం బొంగి చీరలు వీచువారును విండులు విసరు
వారును గుణధ్వని సేయువారును శంఖంబు లొత్తువారును భేరీపణవాదులు
మ్రోయించువారునుం బెలుచ నార్చువారును నయి పేర్చినం బృథివి వ్రేఁ
గగున ట్లుండె నిత్తెఱంగునం జెలంగి మారుతిసూరెలం జేరి యిట్లనిరి. 316

మ. గదనే ర్పెక్కుడు గల్గుదర్పఘనుఁ డీకౌరవ్యరాజన్యుఁ డు
న్మదలీలం బయి నట్లు బిట్టుఱికిన న్వంచించి పోకిట్లు సే
యుదె నీవాటునఁ బెన్నొడల్ విఱిగి వీఁ డుర్విం బడఁగా మాకు నో
ప్పు దలిర్పం బులకాంకురంబు లెసఁగెం బో విప్పుసుం జూడుమీ.

ఆ. పరులచేతఁ గానిపని యైనవృత్రవ, ధంబుఁ బోని యరివధంబు నిర్వ
హించియున్ననిన్నుఁ నేమింద్రుఁ గొనియాడు, నమరులట్లపొగడ మోదము సెలంగి.

క. అవమానంబులు సేసిన, యవినీతుల దుస్ససేనుఁ డాదిగఁ గలవా
రి వధించి యడుగు పగతుని, యవుదల నిడి తింతవార లవనిం గలరే. 319

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రశంసించిరి భీముచేసినగదాసమర
ధర్మవిరోధంబు లాఁతిరాజులమనంబుల నుండునో యని శంకించి కృష్ణుం
డెల్లరాజులం గలయం గనుంగొని యిట్లనియె. 320

ఉ. చక్కటి లేనియాలమునఁ జంపె నసత్య వలన దీదురాత్మకుం
డక్కటికంబు లేక సతి సంతిలు నేసినను గృపారతిం
దక్కక తండ్రి సాలసిగ ధర్మజుఁ డన్నెటి సేయఁ డయ్యె వీఁ
డుక్కివుఁ డిట్టి చాపునకు యుగ్గుఁ డగుం దలపోసి చూడఁగన్. 321

క. విదురాదులు సెప్పఁగ నున్నదుఁ డై యీఁడయ్యెఁ దగినమాత్రయు భూసం
పద వీఁడు పాండవుల కది, యది యగునె బకారిప్రతిన కగ్గం బైనన్. 322

ఆ. నేలఁ గూలి మ్రాను పూలెనిట్లున్నయి, స్వపకర్మ గుణిచి పాడి తెలఁగు
తేటపడఁగ మాట లాట దా నేల మీ, రెక్కుఁ దరదముల మహీశులార.

వ. అని యిట్లు పుండరీకాక్షుండు దన్ను నాక్షేపించుట యాకర్ణించి కౌరవేశ్వ
రుండు గోపాయత్తచిత్తుం డై పీఁటుండు మోఁన లేచి చేతుల భూతలం బూఁది
కొని భూమునుఁ జేరి యతనిపయిం బఱపె నప్పు డపరభాగంబు
విఱుగ వ్రేటు పడి యుఁగిరి గాల నెత్తి మూచుమహానాగంబుచందంబు దోఁచె
నట్లు ప్రాణాంతికంబు ఖైనసేననాభరంబు దలంపక కూర్చుండి మున్నాకృ
ష్ణుండు జిష్ణుతోడ సంభాషించుటయు నతం డూరుతలంబుఁ గరపుటంబున
నప్పళించుటయు నడ నడ గనుటం జేసి భీముడాటునం దొడలు విఱిగి పడినప్పు
డప్పటిబుద్ధిబుద్ధిమాటలు నానన్నయు వినికిం గాకేమి యని యూహించి చేయు
నది లేక యున్నను గూఁడుముఁ దన్నుఁ డగుటం గోపాలదేవుతోడ నిట్లనియె. 324

—•—◆ తొడలు విఱిగిపడినదుర్యోధనుఁడు కృష్ణు నాక్షేపించుట. ◆—•—

సీ. కంసదాసునిపుత్త్రకా నీవు నేమురా, చారంబుఁ గృపయు లజ్జయును లేక
ప్రేలెదు నీవు సెప్పినఁ బార్థుఁ డేసిన, నన్ను గైకొని గదాసంగరంబు
పాడి దొఱంగి యుద్ధన్యాయనష్టుఁడు వైచెఁ, గాక చక్కటితోడి కయ్యమైన
లీల మిమ్మంద ఱొకనేలపాలుగఁ జేయ, నే శిఖండి గడంగి యేసె ననఁగ

తే. నర్జునుఁడు శాంతనవుఁ గూల్చినట్లు చేసి
తత్త్రగురుచాపునకుఁ బాండవాగ్రజున్ను
బొంకు మని పంచి తగదంబు పుడమిఁ గ్రుంగఁ
గర్ణుఁ జంపించి తే మనఁ గలదు నిన్ను 325

క. భూరిశ్రవుఁ డొక్కనితోఁ, బోరఁగ నేయించి తట్లు పాడిచీఁకటి నం
హారహేతు సైంధవుని నరు, బారిపఱిచి తిట్టనీకుఁ బల్కులు సనునే. 326

క. నను భీష్ము గురుని సూతను, మునిఁ భూరిశ్రవు జయద్రథుం జక్కటి ద
ప్పనియనిఁ గొల్వఁచ్చఁగ న, చ్చునె నీకుం గపటశూర సుచరితదూరా. 327

వ. అనిన విని యచ్యుతుం డతని నవలోకించి నీవు భీముని బాలునిఁ బాములం
గఱపించియు విషం బిడియు నీటం ద్రోచియుం బలువాఱుం జంపఁ దెగితివి
కొంతియుఁ గొడుకు లేవురును నిద్రించుసమయంబున జతుగృహంబు

దహించితివి ధర్మోత్తరచరిత్రుం డగునజాతశత్రుసంపదలఁ గపటద్యూతం
బున నపహరించి తంతఁ దనివిం బోక యాజ్ఞసేని నేకవస్త్ర రజస్వలం గొ
లువుకోపల భంగపెట్టి తాఁబ్రొద్దు నిన్ను నిట్టిదురవస్థకుం దేరం దగి యుండ
నట్లు పోయి సమయంబు నడపి నీచేసినసకలదుష్కృతంబులు సహించిన
యప్పాండవాగ్రజుండు వనుప నేను బుడమిపా లడుగ వచ్చిన నీ నేరవైతి నీనే
రమి ని క్షైతిలభవదీయం బగులోభంబునం బాపనిశ్చయంబున మదంబున
శాంతచిత్తు గుశాంతనవద్రోణులకుం బ్రాణహాని వాటిల్లె వినుము ద్రుప
దునితపోయజ్ఞప్రభావంబుల నదియ పనిగా జనియించినశిఖండిధృష్టద్యుమ్ను
లాభీష్మగురులమరణంబులకుం గారణంబులు గాక తక్కుడుగే పెక్కండ్ర
తోడం బోరి డస్సినసాత్యకిం జంపునాఁ డైనభూరిశ్రవుం జంప కుండుమే
యనేకప్రాభయోధు లొక్కరుని బాలు సౌభద్రుం బాదవి చంపినం
బూనినపూన్కి నిఖిలోపాయంబుల నెఱపక పుణ్యాత్మ యైనపాంచాలి నర
ణ్యంబునం బరిభవించినపాపాత్ముని సైంధవుని బ్రదికి పో విడిచి యర్జునుం
డగ్నిం బ్రవేశించునే యిన్నీతిపరులచరిత్రంబులు [1]నిర్మలంబులు ఘోషయాత్ర
నిన్ను గంధర్వులు పట్టుకొని పోవునప్పుడు (నీవారెల్లం జూడఁగ నర్జునుండు)నిన్ను
విడిపించుట యెఱుంగవే గాంగేయకుంభజకర్ణాశ్వత్థామకృపు లుద్దామసమ
గ్రసైన్యంబులతోడ నడవ నీవు విరటునిగోవులం బట్టికొని పోవుచోట
మీ రందఱుఁ దనసమ్మోహనాస్త్రంబున మూర్ఛితు లైనసమయంబున
నర్జునుండు నిన్నుం గాచుట యెఱుంగ రాదె నీ నాపాదించినపాపంబుల కెల్ల
మూలం బైనకర్ణునరదంబు ధరణిం గ్రుంగినఁ గవ్వడి వాని నేయ కేల కాచి
కొని యుండు నుండెనేనియు భూసురశాపంబున నట్టిరథంబునకు నిష్కృతి
గలుగునే కావున నన్నియు సమయించుట సముచితంబు యుధిష్ఠిరుండు శల్యుం
డెగటార్చిన తెఱం గొప్పు నొప్ప దని యుగ్గడింపక మేలు సేసితి పాండునందనులు
పుట్టినంతనుండి నేఁడు దుదిగా నీయెడ ధర్మవిరోధం బాచరింపరు కురుకులంబు
నకు గుద్దలి గొని దుర్ద్యూతంబు నీవ తొడరితి దాన నింతలు పుట్టెఁ బవనతనయుం
డు పట్టినప్రతిన యెఱుంగవె గద నూరుభంగంబు సేయుదు నని పలికి పిడికిటం
బొడుచునే యవి యెల్లను వృథాజల్పంబు లూరకుండు మనుటయు నజ్జననాథుండు
జనార్దనున కిట్లనియె. 328

చ. చదివితి నెల్లవేదములు జన్నములు లొప్పఁగఁ జేసితిన్ రమా
స్పద మగువృత్తిఁ బొల్చి నరపాలకు లెల్లను గొల్వఁ గంటి దు
ర్మదరిపుగాఢగర్వపరిమర్దనకేళి యొనర్చితిం దగం
దుది నని మిత్రబాంధవులతోఁ ద్రిదివంబున కేఁగు టొప్పదే. 329

1 నిర్మలత్వంబులు.

వ. నీకుం జూడ నెట్టివాఁడ నైనను నాకేమి మీరింకఁ బశ్చాత్తాపదుఃఖితులగుచు నుందురుగాక యనియె నప్పుడతనిపైఁ బుష్పవర్షంబులు గురిసె దేవదుందుభులు మొరసె దిశలు తెలివొందె మృదుసమీరణంబు సుగంధియై వీతెంచె నంతయు ననుసంధించి యకౌంతేయులు దారు ధర్మంబు దొలంగి గాంగేయ ద్రోణకర్ణశల్యదుర్యోధనాదుల వధించుట యత్తఱి గ్రొత్తయై తోఁచినఁ జిత్తంబుల వగయు లజ్జయు మిగులం బొడమి మొగంబులఁ దోఁప విన్ననై యున్నం జూచి వెన్నుండు తత్సమీపంబునకుం జని వారలతో ని ట్లనియె.

సీ. గాంగేయగురుకర్ణకౌరవపతులఁ జక్కటియనిఁ బరిమార్పఁగాన మైతి
మని మీరు వగవకుఁడు దర్పోరులుగ్రులు, వేదులు ప్రస్ఫుటవిక్రమమున
నడరి వారల గెల్చుటరిది గావున నేను, బహువిధోపాయముల్ వన్ని యిట్లు
దీర్చితిఁ గాక యతిక్రాంతిప్రపరాక్రము, లలఁతులఁ బోదురే యట్లుఁ గాక

తే. వారి విధి యివ్విధమునఁ జాలనంగఁ జేసె, దైవఘటనలు దప్పింప మీవశంబె
సురలు దనుజుల గెల్చినచొప్పు లిట్ల, సంతసపుసమయంబున వంత లేల. 331

పాండవులు కృష్ణసాత్యకులతోఁ గౌరవశిబిరంబునకుం బోవుట.

వ. కృతకృత్యుల మైతిమి ప్రొద్దునుం జాల వ్రాలె సేనయు సైనికవరులును విశ్రమింప వలయుఁ బోదము రెం డనినఁ బాండవులు దెలివొందఁ బాంచాలురునుం దక్షిణభూపాలురునుం బ్రమోదంబు నొంది రప్పుడు కృష్ణుండు పాంచజన్యంబు పూరించిన నర్జునుండు దేవదత్తంబును యుధిష్ఠిరుం డనంతవిజయంబును భీమసేనుండు పౌండ్రంబును నకులసహదేవులు సుఘోషమణిపుష్పకంబులును బూరించిరి సకలరథికోత్తములును దమతమశంఖంబు లొత్తిరి భేరీపణవాదితూర్యంబులు మ్రోసె నాసముత్థితనినాదంబులు నింగి నిండె నిఖిలజనంబులుం బాండవేయులం బొగడునులివు దిక్కుల దీటుకొనియె ని ట్లుబ్బునం జెలంగుచు వార లందఱు నచ్చోటు గదలిరి కౌంతేయులు గౌరవశిబిరంబునకుం జనిన సాత్యకి యనుగమనంబు సేసె ధృష్టద్యుమ్నప్రముఖు లైన ద్రుపదజ్ఞాతులును ద్రౌపదేయులునుం దక్షిణధరణీశులును దమవిడిదలలం గాని విశ్రమంబునకు వెరవు గా దని తలంచి తా రందుఁ బోయి నాఁటిరాత్రి నిలిచి రేపకడ గరిపురప్రయాణంబున కొదవం జనుదెంచువారుగా విన్నవించి ధర్మతనయునను మతి వడసి సైన్యసమేతంబుగాఁ బోయి రట్లు వార లటు వోవ నప్పాండునందనులు సని సంగీతప్రవర్తకసంఘంబులు విరిసి చనిన రిత్తయై యున్నరంగస్థలంబు చందంబునం బొడరి యున్నయాశిబిరంబుఁ బ్రవేశించి నీనందనునగరు సొచ్చిన నచ్చట నున్నపరిచారకులును దత్సహవాసులును మణికనకాదివస్తుసంచయాధ్యక్షులును నయ్యుధిష్ఠిరుం గాంచి యాదరణంబు వడసి రక్కుంతీనందనులు రథంబులు డిగ్గునవసరంబున వాసుదేవుండు వాసవి నాలోకించి.

క. కవదొనలును గాండీవము, నవల నిడం బనుపు ముందర రదము డిగు [1]మే
న విడప డిగియెద శుభకర, మవు నివ్విధ మట్లు సేయు మనుడు నతండున్.
తే. ధనువు తూణీరయుగళంబుఁ గొనుచు రథము
డిగుడు శౌరి పగ్గంబుల నొగల ముడిచి
డిగియెఁ గేతనకపియు భూతగణయుతము
గాఁ దొలంగెన త్తేరు తత్క్షణము మండె. 334

అగ్నదత్తం బైనయర్జునరథంబు గాలిపోవుట.

క. తురగంబులతోఁ గూడఁగ, నరదము సకలంబు సుజ్వాలానలశిఖలం
జురచురఁ బోయినఁ గని య, న్నరుఁ డచ్చెరువంది కృష్ణునకు నభిముఖుఁ డై.
వ. వినయంబుతోడ మోడ్పుఁగేలు ఫాలతలంబునఁ గదియించి వినతుం డై దేవా యిట్టియాశ్చర్యంబుం గలదె యీరథంబు దగ్ధం బగుటకుఁ గారణం బేమి నాకు వినం దగునేని యానతి మ్మనిన మురారాతి యతని కిట్లనియె. 336
క. గురుకర్ణులయస్త్రాగ్నుల, నెరిసినయది మున్ను దీని నిటు గా కుండం
భరపడి రక్షించితి సం, గరము దెగినఁ దొలఁగి యిపుడు గాల విడిచితిన్. 337
వ. అని చెప్పి యప్పు డద్భుతరసమగ్నులగుచున్నతక్కటిపాండవులం గనుంగొని యలరుమొగంబున నలంతినవ్వు కాంతి దళుకొత్తఁ గొంతేయాగ్రజుం గౌఁగిలించికొని యే నుపప్లావ్యంబునకు వచ్చి నిన్నుఁ గనిన నీవు నాకు మధుపర్కం బిచ్చి విన్వచ్చుఁ జూపి వీఁడు నీకు రక్షణీయుండు సుమ్మీ యని యప్పగించి తేనును నియ్యకొంటి నట్లు నాసఖుండును సురక్షితుం డై వీరక్షయకరం బగుమహాసంగరంబు భవద్భీమనకులసహదేవసహితంబుగ నిస్తరించి జయంబు గైకొనియె నిట మీఁదం జేయ వలయుకార్యంబులు నడపు మనవుడు నతం డచ్యుతున కిట్లనియె. 338
తే. ద్రోణకర్ణదివ్యాస్త్రముల్ క్రూరభంగిఁ, గవియునప్పుడు మమునీవు గావకున్న
బ్రదుకు టెంతద వ్యధికశుభంబులకు భ, వత్ప్రసాదంబు గని కాదె వాసుదేవ.
వ. అని వెండియు. 340
క. మునిపతి కృష్ణద్వైపా, యనుఁడు ప్రబోధించె నన్ను నచ్యుతుఁ డేది
క్కున నుండు నెమ్మి నాది, క్కునకు జయము గల్గు నని యకుంఠితకరుణన్.
వ. అనుటయు మాధవుం డమ్మనుజేంద్రున కిట్లనియె. 342
క. మనకుం గౌరవులకుఁ బదు, నెనిమిది యక్షౌహిణులు మహీశ్వర కల వ
వ్వెనుమొన లన్నిటిలో న, ర్జునునకుఁ బాటి యని యొక్కరునిఁ బేర్కొనుమా.
తే. ఈశ్వరుఁడు క్రీడి కస్త్రంబు లిచ్చుచోట, మత్సముండవుగ మ్మని వత్సలత్వ
గౌరవంబునఁ బల్కె నిక్కముగ నంత, వాఁడు గాఁడె నీతమ్ముఁడు వసుమతీశ.

1 'మేను విదప' అనియె వ్రా. ప్ర.

చ. కరుణ జనించి శాత్రవుల గాండివి సంపఁగ నొల్లఁ డయ్యె నేఁ
బరువడిఁ దెల్పి యైక్యపరిభావనిరూఢము గాఁగఁ జేసినం
దిర మయి పోరికిం గృతమతిన్ మతి చొచ్చి సరిత్సుతాదులన్
వెరవున గీటడంచెఁ దనవిక్రమ మెందుఁ బ్రసిద్ధి కెక్కఁగన్. 345

క. అచ్చెరువు సంపుటకుఁ దన, యిచ్చఁ జొరక కేలి సలిపెనిన్నాళ్లును వి
వ్వచ్చుఁడు హిత మేఁ జెప్పినఁ, బొచ్చెము లే కంతరంగమున నిల్పెఁ దగన్.

క. ఏ నుపదేశించితి ననఁ, గా నొకపెం పెంచినాఁడు గాని తలంపన్
మానవనాథ సురేశ్వర, సూనుఁడు నాయట్టివాఁడ చు మ్మేపనికిన్. 347

క. నిమిషార్థంబునఁ ద్రైలో, క్యమును సురాసురయుతంబుగా నోర్చుం గో
పము పొడమినఁ గవ్వడి క, య్యమునం గురుబలము గెలుచు టరుదే తలఁపన్.

వ. అని పలికె నిట్లు సల్లాపసౌఖ్యం బనుభవించి వాహనమోచనం బాచరించిరి
తదనంతరంబ కౌంతేయులు గమనీయాభరణంబులుం గనకరాసులును రత్న
సంచయంబులు మొదలుగా మహనీయవస్తువిస్తారంబునం బ్రస్తుతిపాత్రం
బైన నీపుత్త్రుభాండాగారంబుఁ జేకొని నాఁడు పోలిగలనికిం బోవక యున్నరథర
థ్యమాతంగతురంగంబులం జూచికొని దాసదాసీకుబ్జవామనగణంబులం గైకొని
యధికప్రమదసముదచేష్టితంబుల నుల్లసిల్లిరి కొండొకసేపునకు శౌరి వారలతో
నిట్లనియె. 349

ఆ. వీడు పాడు గాన విశ్రాంతి కయ్యెడ, మనము మసల వలదు మంగళార్థ
ముగ శుచిప్రదేశమున కేఁగి యచ్చోట, నుచితవర్తనములనుండవలయు. 350

క. అని చెప్పి పాండునృపనం, దనులం దనతమ్ముని న్ముదం బెసఁగఁగఁ దో
డ్కొని పోయెను వసుదేవుని, తనయుఁడు శిబిరంబు వెడలి ధరణీనాథా. 351

వ. ఇట్లు పోవునప్పుడు శౌరిసారథి యైనదారుకుండు మున్నెప్పుడును విడిదలం దమ
తేరు నశ్వంబులనుం [1]బరికించి యుండెడువాఁడు బోయలు నీకొడుకు మడు
వున డాఁగినయునికిఁ జెప్పిన నయ్యెడకు వచ్చుకౌంతేయులతో వీ డెల్ల నొక్క
తలగా వెడలి వేసుకఁ జూడం జనుదేరఁ దాను నయ్యరదంబున శైబ్యసుగ్రీవ
మేఘపుష్పవలాహకంబులం బూన్చికొని వచ్చుటం జేసి తా నప్పుడు కౌరవ
శిబిరంబునకుఁ దోడన యరుగుదెంచెం గావున నాదవి సుకల్పితస్యందనుం డై
యద్దామోదరుదృష్టిపథంబున నిల్చె ధర్మనందనుండును దమ్ములును సాత్యకి
యును సముచితవాహనంబులు దెప్పించుకొని యారోహణంబు సేయ నన్నా
రాయణుండు నిజరథారూఢుం డై యత్తెఱంగునం బోయి. 352

తే. ఓఘవతి యనఁ బరఁగినయొక్కపుణ్య, తటిని చేరువఁ గల్గిన దానితీర

1. బరికల్పించి-బూన్చికొని.

భూమియం దర్ధ మగుతలమున వసించి, రమ్మహాత్ములు చిత్తంబులలర నధిప.

వ. అని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకుఁ బాండవులవిజయంబు తెలుఁగుఁ జెప్పె నని వైశంపాయనుండు. 354

క. జనమేజయునకు నిట్లను, విను మప్పుడు ధర్మసుతుఁడు విష్ణునివదనం
బునఁ జూడ్కి నిలిపి కరిపుర, మునకుం బోవలయు నీకుఁ బురుషార్థనిధీ. 355

వ. అని ప్రార్థించె ననుటయు నమ్మనుజపతి యమ్మహీసురవరున కిట్లనియె. 356

చ. అని ధృతరాష్ట్రనందనుల నందఱ గీటడఁగించి వేఁడి యా
యనకడ కచ్యుతుం బనుపు నంతటికార్యవిశేష మేమి గ
ల్గెనో మునినాథ యానృపతికిన్ మది నాకు వినంగ వేడ్క వు
ట్టినయది యత్తెఱంగు ప్రకటింపు పరిస్ఫుటవాక్యసంపదన్. 357

వ. అనవుడు నాసంయమి యిట్లనియె. 358

ఉ. కౌరవముఖ్య ధర్మగతి గాని తెఱంగునఁ గ్రీడి పంపఁగా
మారుతి గూల్చె నట్లగుట మాన్యచరిత్రుఁడు ధర్మసూతి గాం
ధారి శపించు దీని విని తమ్మని యాత్మఁ దలంచి యిమ్మెయిం
గూరినభీతి నవ్వనితకుం దగుభంగి శమం బొనర్పఁగన్. 359

శ్రీకృష్ణుఁడు గాంధారి నూఱడింపఁ గరిపురంబునకుఁ బోవుట.

వ. పనిచెం గాని ధృతరాష్ట్రు నుద్దేశించి కాదట యచ్యుతుం డరిగి యప్పటి కుచితం బగువిధంబునఁ గార్యంబు నడపె నాకర్ణింపు మట్లు దన్నుఁ బ్రార్థించిన నప్పురుషోత్తముండు పసి తెఱంగడిగి పాండవాగ్రజుండు సెప్ప విని రథారూఢుండై యతిరయంబునఁ గరినగరంబున కరిగి మొగసాల నిలిచి యాంబికేయునకుఁ దనరాక యెఱింగించి పుచ్చి తగం జొచ్చి యంతక మున్న గాంధారీద్వితీయుం డై కొడుకులదెస వగలం [2]బొగులు చున్న యమ్మహీకాంతుని వలనికారుణ్యంబున నతనికడకుం జనుదెంచి యున్న కృష్ణద్వైపాయనమహామునిం గని వినయసంభ్రమంబులు దలకొనఁ దత్పాదంబులకుఁ బ్రణమిల్లి యక్కురురాజునకు గాంధారరాజనందనకు నమస్కరించి కులపతిసన్నిధి యగుట నిలాతలంబునం గూర్చున్న యజ్జననాథుసమీపంబున నాసీనుం డై. 360

ఆ. అన్నరేంద్రుపాణి యల్లన తనకరా, బ్జమునఁ గీలుగొల్పి బహుళబాష్ప
కలితవదనుఁ డగుచు గళమున నెలుఁగు రి, యాడ వగచి యమ్మురాంతకుండు.

వ. తత్ప్రదేశంబున నున్నకనకకలశజలంబుల ముఖప్రక్షాళనంబు సేసి యెలుంగు నూలుకొనం జేసి యిట్లనియె. 362

చ. అకట కులం బకారణమ యంతయు నాశము నొందె నిట్టిదా
నికిఁ జొరనొల్ల రైరి మహనీయచరిత్రులు నాఁడు పాండవు
ల్సకలము నీ వెఱుంగుదు చలంబును నీసును దక్కి నన్ను సం

ధికి నిట రా నొనర్చుట మకేదిం దలపోయు మ దెట్టిశాంతియో. 363

వ. అని యంత నిలువక. 364

క. గెలువరె జూదమును లెందును, గలదే తలఁ బట్టి పుణ్యాకాంతఁ గొలువులో
పలి కీడ్చి తెచ్చి వలువల, నొలుచుట యే మనఁగ వచ్చు కనుర్వీనాథా. 365

క. దానికి నొచ్చినమనముల, తో నడవికిఁ బోయి బహుళకేదుఃఖంబుల న
ట్లూని విరాటుపురిం బడఁ, గానియిడుమ వడియు వారు కగనలర కంటే. 366

ఉ. ఏవుర కుండ నొక్కొకటి కయి మ్మని యాళులు వేఁడి కాన రై
రే వల దన్న నీకొడుకు కెల్మెయి మానర లోభగర్వముల్
నీవును నట్ల కాక మహాకనీయమతుల్ విదురాదిబాంధవుల్
వేవురు సెప్ప గే యధిప కవింటె తగం బలు కొక్కఁ జేనియున్. 367

క. కాలోపహతమనస్కుఁడు, మేలు తెరువు వట్టు నెట్లు కమెయికొని యది యిం
కేల తలపోయ నుడుపం, జాలుదు రే నరులు [1]దైవకసంపాదితముల్. 368

వ. అని వెండియు ని ట్లనియెఁ బాండవులు గల్మషాయత్తచిత్తులు గామియు మీరు
నెఱి లేమియు విచారింపు మేను మ్రొక్కి వేఁడికొనియెద వారల దెసఁ గోపంబు
లేకుండ వలయు నట్లుంగాక నీకును గాంధారికిని వలయుపరలోకక్రియాక
లాపంబులు వారియుంన నిలిచెం గావున వారికి శుభంబు గోరుట లెస్స మీచి
త్తంబు నొప్పించితి నని యెప్పాట దురపిల్లెడునో ధర్మజు తెఱం గెఱింగెదు
గాక యని పల్కి గాంధారరాజనందన నుద్దేశించి. 369

ఉ. నీ కెన నచ్చు రాజనమకేనిక ధర నెందును గంటి మే నృపా
నీకము వించు నుండ నునుకేనిం దగుపల్కుల నంత యొత్తుదే
నా కది సిక్కఁ జిత్తమున కనాఁటిప్రియంబ బగుచుండు నిప్పుడున్
లోకవిరుద్ధవృత్తిచనకలుం డతఁడి మ్మెఱుఁగండ యేమియున్. 370

క. నీమాటకు దుర్యోధనుఁ, డామెయిఁ దాఁ ద్రుళ్లి పడక కయవుఁ గా కని నాఁ
డే మేనిఁ గొంత యుక్కట, భూమి యొసఁగె నేని యింత కవుట్టదు సుమ్మీ.

వ. కీడు వుట్టు నని నీవు సెప్పితి చెప్పినమాటయుం దలకూడెఁ బాండవులవలనం దప్పు
లే దని యెఱుంగుదు గాదె వారల కలుగ కుండునది నీ వలిగి చూచినం
ద్రిలోకంబులు భస్మీభూతంబు లగునట్టితపఃప్రభావంబునం బ్రసిద్ధవు గావున
నిన్నుం బ్రార్థించెద నని పల్కిన నద్దేవి యది యంతయు నీచెప్పినట్టిద యని
వెండియు. 372

చ. విపులవిషాదతాపమున కవేదన నొందుమదీయబుద్ధికిం
దపగత మయ్యె నీదువచకనామృతసేచనఁ జేసి యిట్టిచో
నపరిమితప్రభావ వినుక మంధుఁడు దీనుఁడు వృద్ధు నైనయీ

1 దైవసంపాదనముల్. 2 డెఱుఁగం డవివేకగర్వి యై.

నృపు నరయంగఁ బాండవులు నీవును [1]యుక్తులు గారె యెమ్మెయిన్. 373

వ. అని పయిచీరచెఱంగు మొగంబున నదిమికొని యేడ్చినఁ గృష్ణుండు వివిధవాక్యంబుల నద్దేవిం దేర్చి ధృతరాష్ట్రునకు మనస్తాపోపశమనంబు గాఁ బలికె నట్టియెడ నశ్వత్థామయుత్సాహం బమ్మహాత్మునకు హృదయగోచరం బగుటయు దిగ్గన లేచి పారాశర్యుచరణంబులకు వినతుం డై యవ్విభునకుం బ్రణమిల్లి యతనితో ని ట్లనియె. 374

క. గురుసుతుఁడు పాండవులకుం, గర మల్గును వారిఁ బొడువఁ గా నతఁ డీప్రొద్దురవడిఁ గదియును బోయెద, దురపిల్లకుమయ్య మది విధూతకళంకా. 375

చ. అన విని రాజు దేవులు మురారికి ని ట్లని రెంతయుఁగా రయం
బునఁ జనుమయ్య పాండునృపపుత్త్రుల నెమ్మెయి నైనఁ గాచికోల్
వినుతి గదయ్య నీకు నిను వేయివిధంబుల నాశ్రయించు టె
ల్లను ఫల మొందఁ జేయఁగఁ దలంచుట పెంపు సుమయ్య కేశవా. 376

శ్రీకృష్ణుండు కరిపురంబుననుండి పాండవులయొద్దకు వచ్చుట.

వ. పొమ్ము పునర్దర్శన మయ్యెడు మని వీడ్కొల్పిన వాసుదేవుండు వెడలెం దదనంతరంబ వేదవ్యాసమునీశ్వరుండు వారలతో మీకు శోకోపశమనంబు గ నిప్పుడు శౌరి సెప్పినవచనంబు లాదరణీయంబులు సుండీ యని యుపదేశించి వెండియు వలయువాక్యంబుల వారికి నాశ్వాసంబు గావించి యంతర్ధానంబు సేసె నిత్తెఱంగున గోవిందుండు కృతకృత్యుం డై వెలువడి యరదం బెక్కి యతిత్వరితగతి నోఘవతీతీరంబున కరిగి పాండవులం గని తాను ధృతరాష్ట్రుసన్నిధి గాంధారిం గనుటయు వారలకు దుర్యోధనుండు చెడియె నని నెట్టనం జెప్పక పెరసుంబల్కులు గా నయ్యంబికేయుని యుపేక్షనుం గొడుకుల కీడునం దత్కులంబునకు సంక్షయంబు వాటిల్లుట యుగ్గడించుటయు నాసందునఁ బాండవులవలనఁ బాపంబు లేమి దెల్పుటయును నారాజును దేవులును వారిం గోపింపకుండం బ్రార్థించుటయు నుపచారవచనంబులచందంబున వార లావృద్ధులకు నిస్తారకు లని పలుకుటయు విశేషించి గాంధారికి నుచితభాషణంబుల నత్యంతోపశాంతి గలిగించుటయు నప్పలుకు లన్నింటను దుది నయ్యిరువురు దనచేసినది సామాన్యంబున ననుష్ఠించినయాపత్సమయసమాగమంబు గాఁ గొనినమాత్రయ కాని రోయం డెఱుంగక యునికియు నగ్గాంధారరాజనందన దనకు మగని నప్పగించుటయు నెఱింగించి యంతక మున్న వచ్చి యావిచిత్రవీర్యపుత్త్రుకడం బారాశర్యుం డున్నవాఁ డమ్మహాత్ముం డే నిట వచ్చినపిదప నాదంపతులకు నాయొనర్చినయుపదేశంబు దృఢం బగునట్టిమాటలాడ నోపు ననియు నతనియునికి యట్లు గాఁ దనపోయినపని సఫలం బగుటయుఁ బాండు

1 సుక్తులు.

నందనులకుం దెలియఁ జెప్పె నని వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

క. విను మోఘవతీతీరం, బున కమ్మెయిఁ బాండురాజపుత్త్రులు ప్రీతిం
జనినతెఱఁగు సంజయుచే, విని ధృతరాష్ట్రుండు శోకవిహ్వలుఁ డగుచున్. 378

వ. అతని కిట్లనియె. 379

ఆ. తొడలు విఱిగి నేలఁ బడియుండఁ దల దన్ని, నట్టి భీమసేనుఁ డగ్రజుండు
ననుజచయముఁ దాను నరిగినపిమ్మట, [1]నెట్టు లయ్యె నమ్మహీశ్వరుండు. 380

వ. అని యడిగిన సమ్మానవపతికి నాసూతసూనుం డిట్లను నేను బొదలోనుండి
యుధిష్ఠిరుండు యుద్ధసమయంబును నిశ్చయించిన నీకొడుకు పాలిగలనికి నడ
చునప్పుడు వెలి పాండవపరిజనంబులం గలసి వారు [2]నన్ను డాసినదృష్టిం
గనుంగొన నక్కురుపతికిం బొడసూపక చని గదారణం బనుసంధించి యునికిం
జేసి యక్కౌంతేయు లరిగినయనంతరంబ యమ్మహీకాంతునికడకుం బోగు
లుచుఁ బోయితిఁ బోయిన నతండు ధూళి పొదివినవదనంబుపై నెఱసినవెండ్రు
కలు వాయం ద్రోచికొని నామొగంబుఁ జూచి ధర్మనందను నిందించుచు నవుడు
గలఁచి కన్నీరు గ్రమ్మ నిట్టూర్పు నిగిడించి. 381

తే. నేల నాలుగుసెలఁగులు నేలి భీష్మ, గురుకృపాదులపైఁ గార్యభరము నిల్పి
యున్నవానికిఁ దుది నిట్టు లుండవలసెఁ, గాలసంప్రాప్త మేరికిఁ గడవ వచ్చు.

క. ననుఁ బదునొకఁ డక్షౌహిణు, లనూనవిభవమునఁ గొల్వ నఖిలనృపులు పం
చినపని సేసి మెలఁగి రి, ట్లునికి గనిననీవ యిట్టు లునికియుఁ గంటే. 383

ఆ. వాయునందనుండు గదాయుద్ధధర్మంబు, నుజ్జగించి నింద కోర్చి యిట్లు
సేసె నిత్తెఱంగు సెప్పుమీ సంజయ, మనకు నిపుడు గల్గుజనుల కెల్ల. 384

చ. అనిమిషవాహినీతనయు నస్త్రకళాగురు సోమదత్తిఁ గ
ర్ణుని రణధర్మహీనతకు రోయక చంపినభంగులుం మరు
త్తనయుఁడు నేఁడు సేసినవిధంబును లోకులు పాండురాజనం
దనతతిఁ బ్రువ్వఁ దిట్టరె నృపోథావిజయం బది యెంత యొప్పెడున్. 385

క. అనిలజుఁడుఁబోలెఁ గపటపు, టనువునఁ బగవారి నోర్చి హర్షంబునఁ దే
లునె తూలపోనిమగఁటిమి, దనకుఁ గలుగునట్టికీర్తి తత్పరుఁ డొందున్. 386

చ. మఱియు నొకండు వింట పవమానతనూజునిచెయ్విఁ బెన్దొడల్
విఱిగి ధరిత్రిఁ బడ్డయెడ వేగమె వచ్చి శిరంబుఁ దన్నె నే
ర్పెఱు గలయట్టి శత్రు నవధీరితుఁ జేయుట యొప్పుఁ గాక యే
పఱినఁ బరాభవించిన జనావళి నవ్వదె నొవ్వదే మదిన్. 387

క. మనరాజును దేవులు భం, డనముతగవు నేర్పరించుటకు నేర్తురు భీ
మునిచేసినయది సంజయ, వినిపింపుము వారలకు సవిస్తారముగన్. 388

1 నమ్మహీశుఁ డెట్టు లయ్యెఁ జెపుమ. 2 నన్ను దాసీనదృష్టిం.

వ. మఱియును. 389

మ. చెలులం జుట్టలఁ బ్రోచి యర్థిజనులన్ శ్రీమంతులం జేసి వి
ప్రుల భవ్యస్థితి మన్చి యాగములు పేరుం బెంపు శోభిల్ల ని
[1]ట్టలపుంద్యాగము దానమున్ నడపి నిత్యం బెక్కు సెల్లించి యు
జ్జ్వలతేజంబున నిద్ధభూతి భుజగర్వస్ఫూర్తిఁ బొల్పారితిన్. 390

క. పగవారి నాశ్రయింపక, మగఁటిమియును బ్రాభవంబు మానము నెందుం
బొగడొంద నుల్లసిల్లితిఁ, దెగునంతకు లక్ష్మితోఁ బ్రదీప్తుఁడ నైతిన్. 391

క. సమరము శమంతపంచక, సమీపమున ధర్మవృత్తిఁ జలుపఁగ సత్యో
త్తమలోకము సమకూఱెను, విమలాత్ముఁడ నైతి నొంపు వేయును నేలా. 392

తే. ఎదిరి పెనఁగంగఁ జాలక నిదురవ్రావ, నోంచు తెఱఁగున విషము పెట్టించుపగిది
నింటఁ జిచ్చిడుచాడ్పున నిట్లు సేసి, పడయుదురు గాక రాజ్య మప్పాండుసుతులు.

వ. అని యంత నిలువక. 394

ఆ. పాపకర్ము లయిన పాండుతనూజులు, సమరధర్మ మెడలి జయము గొనుట
గురుసుతునకుఁ గృపునకుం గృతవర్మకుఁ, దేటపఱుపు నాదుమాట గాఁగ. 395

క. దేవవ్రతగురుకర్ణుల, దేవసములఁ బాడి దొఱఁగి దెగటార్చుటయున్
నీవు దలఁపించి వారల, తో వెండియు నిట్టు లనుము దుర్జనదూరా. 396

ఆ. కపటధర్మకంచుకంబున వెలసిరి, గాని సత్యపురుషకారపరులు
గారు పాండుసుతులు వారల నమ్మంగఁ, గాదు సేత గుండెకాయ యిడిన. 397

వ. ఇది నామాట గాఁ జెప్పు మని పలికె నప్పు డచ్చేరువపల్లెలవారు దన్నుం జూడ వచ్చిన సజ్జనంబులఁ గలయం గనుంగొని గాంగేయుండును గుంభసంభవుం డును మొదలైనబంధుమిత్త్రులను లక్షణుండు లోనుగాఁ గలకుమారులను బేరు కొని వారు మున్ను సనుటం జెప్పి వారు సనినలోకంబు లెనసఁ బొటిల్లుట యుగ్గ డించి తనదేవులును దుస్సలయు నాదిగాఁ గలయబలలు దాను లేనిపిమ్మటఁ బొందు దురవస్థలు వాక్రుచ్చి పనివిన విని వారలు గన్నీ రొలుక నుమ్మలికంబు గూరును ల్లంబులతోఁ జని రందుఁ గొంద అశ్వత్థామప్రముఖరథికత్రయం బయ్యెడ మె లంగుట యెఱింగి వారలకు రాజరాజువార్త సెప్పిన వారలు సత్వరంబున నచ్చటి కరుగుదెంచి యరదంబులు డిగ్గి. 398

కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుం జేర విలపించుట.

సీ. కడుబెట్టిదం బగుగాలిచేఁ గూలిన, మహనీయసాలభూరుహము పోల్కిఁ
బ్రబలకిరాతమార్గణములఁ ద్రెళ్లిన, రాజితవన్యవారణము మాడ్కిఁ
గల్పాంతవాయుసంక్షుస్ఫురణంబున, నివిరి పోయినమహార్ణవము కరణిఁ

1 ట్టలపుద్యోగము.

వ. మఱియును.

మ. చెలులం జట్టలఁ బ్రో
ప్రుల భవ్యస్థితి మన్చి
[1]ట్టలపుం ద్యాగము ద
జ్జ్వల తేజంబున నిద్ధభ
క. పగవారి నాశ్రయింపః
బొగడొంద నుల్లసిల్లి
క. సమరము శమంతపం
త్తమలోకము సనుక
తే. ఎదిరి పెనఁగంగఁ జా
నింటఁ జిచ్చిడుచాడ్పు
వ. అని యంత నిలువక.
ఆ. పాపకర్ములయిన పాం
గురుసుతునకుఁ గృపు
క. దేవవ్రత గురుకర్ణుల,
నీవు దలఁపించి వార
ఆ. కపటధర్మకంచుకం
గారు పాండుసుతులు
వ. ఇది నామాట గాఁ
వచ్చిన సజ్జనంబులఁ
డును మొదలైనబం
కొని వారు మున్ను స
డించి తనదేవులును
దురవస్థలు వాక్రుచ్చి
ల్లంబులతోఁ జని రం

# శ్రీత్యాగరాజ శతవార్షికోత్సవము

స్వస్తిశ్రీ వ్యయ నామ సంవత్సర పుష్య బ॥ ౫ శనివారము దివి॥ **11-1-47** సం॥ ప్రభృతి **13-1-47** వరకు శ్రీ శ్రీ శ్రీ త్యాగరాజ స్వామివారి ఆరాధనలు కింగ్స్‌వేలోని శ్రీ రావుసాహెబ్, బూర్గ మాదేవ్ సేటుగారి ధర్మభవనమున జరుపబడును గాన తామెల్లరు దయచేయ ప్రార్థన.

సికింద్రాబాద్. ఇట్లు
## త్యాగరాజ భక్తబృందము

## కార్యక్రమము

**11-1-47** శనివారము ఉదయము ౧౧ గంటలకు
శ్రీ స్వామివారి ఆరాధన, మరియు భజన
" " సాయంత్రము ౪-౩౦ మొదలుకొని ౮ గం వరకు
శ్రీ త్యాగరాజులవారి దివ్యచరితామృత పారము హరిగానము,
శ్రీ బుద్ధవరపు కురంగేశ్వరావు ఎం. ఏ. యల్. టి. గారిచే
ఎన్. శ్రీరాములుగారు ఫిడేలు,
పి. శ్రీరాములుగారు మృదంగం.
" " సాయంత్రము ౮ గంటలనుండి
సంగీత విద్వాన్ బుఱ్ఱాపూర్ణయ్యశాస్త్రి గారు గాత్రము,
పి. వి. రామదీక్షితులుగారు ఫీడేలు,
శ్రీదాసరి చంద్రమౌళిగారు మృదంగం

లంగుట మొఱంగి వారలకు రాజరాజువార్త సెప్పిన వారలు సత్వరంబున నచ్చటి కరుగుదెంచి యరదంబులు డిగ్గి. 398

కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుం జేరి విలపించుట.

సీ. కడుబెట్టిదం బగుగాలిచేఁ గూలిన, మహనీయసాలభూరుహముపోల్కిఁ
బ్రబలకిరాతమార్గణములఁ ద్రెళ్లిన, రాజితవన్యవారణముమాడ్కిఁ
గల్పాంతవాయుసంక్షుభ్స్ఫురణంబున, నివిరి పోయినమహార్ణవము కరణిఁ

1 ట్టలపుద్యోగము.

వ. మఱియును.

మ. చెలులం జుట్టలఁ బ్ర
ప్రుల భవ్యస్థితి మన్ని
ట్టలపుంద్యాగము ద[1]
జ్జ్వల తేజంబున నిద్ధభ

క. పగవారి నాశ్రయింప
బొగడొంద నుల్లసిల్లి

క. సమరము శమంతపం
త్తమలోకము సముత

తే. ఎదిరి వెనఁగంగఁ జ
నింటఁ జిచ్చిడుచాడ్పు

వ. అని యంత నిలువక.

ఆ. పాపకర్ము లయినకోపా
గురుసుతునకుఁ గృపు

క. దేవవ్రతగురుకర్ణుల,
నీవు దలఁపించి వార

ఆ. కపటధర్మకంచుకం
గారు పాండుసుతులు

వ. ఇది నామాట గా
వచ్చిన సజ్జనంబులఁ
డును మొద లైనబం
కొని వారు మున్ను
డించి తనదేవులును
దురవస్థలు వాక్రుచ్చి
ల్లంబులతోఁ జని ద
లంగుట మొఱంగి వారలకు రాజరాజువార్త సెప్పిన వారలు సత్వరంబున నచ్చటి
కరుగుదెంచి యరదంబులు డిగ్గి. 398

కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుం జేరి విలపించుట.

సీ. కడుబెట్టిదం బగుకోగాలిచేఁ గూలిన, మహనీయసాలభూరుహముపోల్కిఁ
బ్రబలకిరాతమార్గణములఁ ద్రెళ్లిన, రాజితవన్యవారణముమాడ్కిఁ
గల్పాంతవాయుసంఘస్ఫురణంబున, నివిరి పోయినమహార్ణవముకరణిఁ

1 ట్టలపుద్యోగము.

3

శ్రీమతి తంగమ్మగారు గాత్రం
శ్రీపి. కుప్పుస్వామిఅయ్యర్ గారుఫిడేలు
శ్రీ రామకృష్ణయ్యర్ గారు మృదంగం

„ „ సాయంత్రం ౫ గం నుండి ౭ గం వరకు
శ్రీ ఆర్ స్వామినాథఅయ్యర్ గారు గాత్రం
శ్రీ మూ...పరం పద్మనాభ గారు గాత్రం
శ్రీ పి. కుప్పుస్వామి అయ్యర్ గారు ఫిడేలు
ఆత్మనాథఅయ్యర్ మృదంగం.

„ „ సాయంత్రము ౭ గం నుండి ౯ గం వరకు
శ్రీ ఎం. యస్ సుబ్రహ్మణ్య అయ్యర్
గారు గాత్రం
కృష్ణమూర్తి అయ్యర్ ఫిడేలు
శ్రీ బి. నటరాజ్ మృదంగం
శ్రీ గణపతి అయ్యర్ గారు కంజిర

మరా:- సమయానుకూలముగా కార్యక్రమములు
మార్చబడును.

శ్రీనివాస ప్రింటింగ్ వర్క్సు, సింగరాయకొండ.

గాలపర్యాయమునఁ గూలి మేదినిమీఁదఁ, బడినపూర్ణేందుబింబంబుపగిది
తే. [1]దుఃస్థుఁడై యుండియును నొప్పు దొరఁగకున్న
యన్నరేశ్వరుఁ గనుఁగొని యడలు నెడల
తోడ మేనులు దూలఁగఁ దొట్రుపడుచుఁ
జేరి యాతనిచుట్టును నాసీను లైరి. 399

వ. ఆసీను లైన నయ్యశ్వత్థామ యిట్లనియె. 400

ఉ. అక్కట యెప్డుఁ బెక్కండ్రు ధరాధిపతుల్ గొలువంగ నుండు నీ
వెక్కడ యున్నవాఁడవు మహాసముదగ్రపీఠ మలంకరించు నీ
వెక్కలిఁ బాఁసి ధారుణి నిట్లు వ్రాలియున్నట్లుగఁ జేసె నీబలం
[2]బెక్కడఁ బోయె నిన్నునిటు లేలొకొ యిక్కడ రారు భూవరా. 401

తే. కడలుకొనఁ బట్టఁ బట్టమునుగాను లెవ్వి, యొసకమొసఁగంగ నీవురు లేల పట్ట
రంగనున నాసనంబున నునునినూళి, గదిరె జలక మేలాడవు కౌరవేంద్ర. 402

చ. అనిమిషవాహినీపతిసమానుఁ డనఁ బరఁగుచుండును నీకు నెప్పుడుం
గనుఁగొను నీ చరణములు వినిపింపఁదగుఁ గర్ణుఁడు దుస్ససేనుఁడున్
నిను నొకయప్డుఁ బాయ కనిశంబును లోకులో నృప వార లెల్ల నె
మ్మనమున శంకలేక యిటు మాటను నిక్కడఁ జేర రెవ్వరున్. 403

క. నీయెడఁ బంచల యగుట్టును, శ్రీ యొవ్వరి నచలవృత్తిఁ జెందెడు విధి య
ట్లై యున్నవారి నిట్టులు, నీయాఁదో యే నింక నేమి సేయుదు నధిపా. 404

తే. అని విలాపంబు సేసినకవిని విభుండు,గన్నుఁగవ నశ్రు లురులంగఁ గరపుటములఁ
దుడిచికొనుచు దుర్గతి నెవ్వాడగు నెఱుఁగు, నట్టకేలకు నాల్కొల్పి యిట్టులనియె. 405

క. మనుజులకు నిట్టిచందము, మును ధాత సృజించినది ప్రమోదము ఖేదం
బును వచ్చును బర్యాయము, బున దీని నెఱుంగవలదె పురుషుం డనఘా. 406

వ. అని యాగతులనగుల నాలోకించి. 407

సీ. పయిపయి నెంతి లాసనిలు వచ్చిన నైన, నుత్సాహ మెడలక యుద్ధ మరులు
నేడ్పడునట్లుగాఁ జేసెడి బంధులు, మిత్రులు సోదరుల్ పుత్రు లట్లు
బలసమేతంబుగా భండనంబునఁ ద్రుంగ, నొక్కఁడు నిల్చుట యొప్పు నెట్లు
మద్భాహువీర్యంబు మహితధైర్యంబును, దలమున్కలైన సద్ధర్మవృత్తి
తే. సంగరము సేయఁ జాలన శత్రు లిట్లు
నొంప సద్గతి వడయుట సొంపు గాదె
యదియుఁ గాక విద్విషులచే నాజిఁ బడక
యుండ మిముఁ గాంచున ట్లేలు నొదవె నాకు. 408

చ. వినుఁడు మహానుభావుఁ డగు విష్ణు నెఱింగి యెఱింగి యే మిముం

1. ధరణిఁ బడి యుం...దఱుంగకున్న. 2 బెక్కడ వోయె.

గాని వెఱపేది కాదె పగఱకుం దలకొంటి జయంబు గోరి మీ
రును బలశౌర్యసంపదనురూపముగాఁ బొగ డొందుభంగులం
బెనఁగితి రేమి సేయుదురు పెట్టిదుఁడై విధి తప్పఁ జూచినన్. 409

వ. పగవ కుండుం డని యేఁ బొదలోనం బొంచి యున్నది మొదలుగ గదాయుద్ధంబుపాడి విడిచి వడముడి పుడమిఱేనిం బడవైచి తలదన్నుట తుదిగా నైనవృత్తాంతం బెల్ల నప్పు డారథికవరులకుఁ దేటపడం బలికిన విని పాండవులదెస నీసును రోసంబు నెత్తి గురునందనుం డరుణాననుం డగుచు నవుడు గఱచి కఠినాక్షరకలితంబు గా నక్కౌరవేశ్వరున కిట్లనియె. 410

ఉ. పాండవు లట్లు మజ్జనకుఁ బాపవిధిం దెగఁ జూచినప్పుడుం
జండతరప్రకోపము నసహ్యపుశోకము నిట్లు చిత్తమొం
డొండఁ గలంప వే నిపుడ యొక్కెడఁ దక్కక యుండ వారి ను
ద్దండమదస్త్రవహ్నిఁ బరిదగ్ధులఁ జేయక యెట్టు లుండుదున్. 411

తే. వినుము సత్యంబు వల్కెద మనుజనాథ
యదరి యందఱఁ బాంచాలు రాది గాఁగఁ
గలుగుబాంధవమిత్రసంఘములతోడఁ
గూడ నేఁ డిదె కృష్ణుండు సూడఁ ద్రుంతు. 412

వ. పనుపు మనిన హృష్టుండై యజ్జనపతి గృపాచార్యుం గనుంగొని యొక్క కలశంబున జలంబు నినిచికొని రమ్మనుటయు నమ్మహీసురవరుండు దమ్ముం జూడ వచ్చి యచ్చట నున్నసమీపాశ్రమమునికుమారులం బ్రార్థించి యొక్క కలశంబు దెప్పించి దానిం దోయపూర్ణంబుఁ గావించి తెచ్చిన. 413

చ. అతనికి నెమ్మి నిట్లనియె నమ్మనుజేంద్రుఁడు నీవు వేగ మం
చితముగ ద్రోణపుత్రు నభిషిక్తునిఁ జేయుము ప్రీతి మచ్చమూ
పతియుఁగ భూసురుండు నృపుఁ బంపునఁ గయ్యము సేఁత లోకవి
శ్రుత మగుధర్మ మట్లగుటఁ జూవె యొనర్చెద నవ్విశేషమున్. 414

వ. అనవుడు నతండు సంప్రీతుండై యగ్గురునందనునకు సేనాధిపత్యాభిషేకం బాచరించిన. 415

ఉ. ఆరథికోత్తముం డధికహర్షముఁ బొందుచు నమ్మహీశ్వరుఁ
గారవ మొప్పఁ గ్రుచ్చి యిఱిగౌఁగిటఁ జేర్చి యుదాత్తసింహనా
దారవ ముల్లసిల్లఁగఁ బ్రియంబు మెయిం గృపయాదవోత్తముల్
సేరి కెలంకులం జనఁగఁ జెచ్చెర నేఁగె నుదగ్రమూర్తియై. 416

వ. ఇట్లశ్వత్థామకృపకృతవర్మలును మహోద్యోగంబున. 417

క. అరినిరవశేషనిరసన, పరమానందప్రచరితపాండవపుత్రో
త్కరబాంధవనికరపరి, స్ఫురణాఢ్యతదీయశిబిరమున కభిముఖులై. 418

వ. చని రని యిట్లు ధృతరాష్ట్రునకు సంజయుం డశ్వత్థామోత్సాహంబు తెఱం
గెఱింగించె నని వైశంపాయనుండు సెప్పిన విని జనమేజయుం డటమీఁదివృత్తాం
తం బెఱింగింపు మని యడుగుటయు. 419

మ. శ్రుతివాక్యార్థనయప్రభావ మునిసంస్తుత్యానుభావా శచీ
పతిముఖ్యానిమిషాభివాద్య [1]నిరసోద్భావైకవేద్యా మహో
న్నతహేతుత్వవిరాజమానచరణా సన్మార్గవదుత్తారణా
సతతోన్నిద్ర[2]విధిస్థకీర్తనసులభా సంవిత్ప్రభావల్లభా. 420

క. సితనీలాదికవర్ణా, హితనిష్కృతిదూర మానసేజ్యాధారా
శతదళభవసత్యవతీ, [3]సుతాదిబుధమతిలతాప్రసూనాకారా. 421

మాలిని. భరితవికసనాంతః[4]పద్మనిశ్రేణికాసం
చరణపరిణతిత్వజ్ఞాఘనీయప్రమోద్య
స్మరదుపగమలీలాముఖ్యమానేందుబింబ
క్షరదమృతవిగాహోత్సాహసాంద్రరూపా. 422

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున శల్యపర్వంబునందు
సర్వంబును ద్వితీయాశ్వాసము.

శ్రీమదాంధ్రమహాభారతమునందలి శల్యపర్వము

సమాప్తము.



శ్రీ
హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## సౌప్తిక పర్వము, ప్రథమాశ్వాసము.



శ్రీమత్కౌస్తుభరత్నో
ద్దామారుణరశ్మిభూతిధవళమరీచి
స్తోమపరభాగరమ్య మ
హా[1]మహితస్ఫురితతనుఁడ హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె 2

తే. సంజయునిచేత గురుసుతోత్సాహ మట్లు
వినినధృతరాష్ట్రుఁ డిట్లను వీరసభ్యుఁ
డనఁగఁ జాలునశ్వత్థామయును సహాయ
రథికులును విక్రమించినక్రమము సెపుము. 3

వ. అనుటయు నమ్మానవపతి కాసూతసూనుం డిట్లను నవ్విధంబునఁ గురుపతి యశ్వత్థామ కభిషేకంబు సేయించిన నాకృపాచార్యులును గృతవర్మయు గురుపుత్త్రునుత్సాహంబున కుపోద్బలకం బగునుద్యోగంబునం బొదలి రమ్మువ్వురు మహీపాలుండు పాండవులం బరిమార్చుటకుం బనిచిన నట్లు పూని దక్షిణంబు ముట్టి పడమట నున్నపాండవశిబిరంబున కభిముఖులై చని రత్తెఱంగున నవ్వీటికెలని కనతిదూరంబుగాఁ జని యొంటిఁ గనఁగు లాలించి. 4

ఉ. అందలివార లెల్లను జయంబునఁ బొంగుచుఁ జేసెలుంగు లం
దంద చెలంగఁ గాఁ బలుక నార్వఁగ నొత్తిలి నవ్వ నాకసం
బందినయట్టిమ్రోఁత విని యక్కడ పోవఁగ నుల్కి రప్పుడ
మ్ముం దడవక వడిన్ వెడలు నూఁకలు మ్రోయుటగాఁ దలంచుచున్. 5

వ. ఉలికి యట పోవు టుడిగి యెచ్చటికేనియుం దొలంగి నిలిచి మఱి కర్జంబుఁ జూచికొనువారై యారథికవరులు మగిడి తూర్పుదెస కొంతద వ్వరిగి రనిన

1 మహిమ.

నమ్మాటలు వెడనెడ వినుచుం దనకుం బాటిల్లినదురవస్థ చింతించుచు నాంబి
కేయుం డిట్లనియె. 6

సీ. సంజయ కురురాజు సమయునే యిట్లు భీ,మునిచేత బలశౌర్యముల నజయ్యుఁ
డని నమ్మియుండితిఁ దనయులు నూర్వురు, మడియుట వినియు నామనము వెక్క-
పఱియలై పోననిభంగిఁ జూడఁగ ఱాతి, నొనరించినది గాఁగ నోపు నింక
నడియరితనమున నప్పాండవుల నాశ్ర,యింపఁగఁ జాలనే నెక్కడేనిఁ
ఆ. బోదుఁ గాక యట్టిభూపాలుతండ్రి నై, ప్రాభవమునఁ బేర్చి పరమదైన్య
వృత్తి కోర్వఁ దగునె విన వశమే మాట, లామరుత్తనూజుఁ డాడ నాకు. 7

వ. అని పలికి యశ్వత్థామప్రభృతు లేమి సేసి రనుటయు నజ్జనపతికి సంజయుం డి
ట్లనియె. 8

క. ఇమ్మెయి నారథికవరులు, గ్రమ్మఱి చని యడవి సొచ్చి కని రొకమడు వం
దిమ్ముల సూతజనులు ర,థ్యమ్ముల నీళ్లకును దిగువ నప్పుడు దారున్. 9

వ. రథంబులు డిగ్గి యంబుపానంబు సేసి యామ్రోఁతదెస నాలించు చుండిరి. 10

తే. అంతఁ బశ్చిమధరణీధరాగ్రపశ్చి, మంబునకుఁ బోయె మార్తాండమండలంబు
సాంధ్యసమయకృత్యంబులు సలిపి రపుడు, రథికవర్యులుమువ్వురు రాజముఖ్య.

వ. సలిపి వా రొక్కవటవిటపిసమీపంబున నాసీనులై రాసమయంబున. 12

తే. వారిముఖమండలములతో వారిజములు
మొగిడె శోకతమంబుతో నిగిడెఁ దిమిర
పటలి బహువిచారములతోఁ బరఁగఁ బొల్చె
భూతబేతాళగణములు భూపవర్య. 13

క. కలుగు గురుసుతున కెల్లం, గలహం బని చూడ నమరగణ మధికకుతూ
హలమున వచ్చెనొ యనఁ జుక్కలు దోఁచెఁ గగనవీథిఁ గౌరవనాథా. 14

వ. ఇట్లు రాత్రి యగుట దివాచరంబులైనజంతువు లుపశాంతవర్తనంబు లయ్యె
రాత్రిచరంబులైనవి సంచరింపం దొడంగె నప్పు డమ్మువ్వురు నెవ్వగలఁ
గూరినమనంబులతోఁ గురుబలంబు కారణంబ పొలియుట యుగడించి తత్సంబం
ధకలితంబులైనభాషణంబులు చెల్లుచుండ నుండి డప్పి గూరి కొండొకసేపునకు
మహీతలంబున మేనులు వైచి వందురుచుండి రందుఁ గృపకృతవర్మలు నిద్ర
వొందిరి గురునందనుండు క్రోధాతిశయంబునం జేసి నిదుర వొందక వటవిటపంబు
గలయం గనుంగొనువాఁడు తదీయశాఖోపశాఖల నానాకాకంబులు నిలీనంబు
లై నిద్రించుచుండ నాలోకించె నయ్యవసరంబున. 15

సీ. మిడుఁగుఱుగములు గ్రమ్మినయట్లు నిగిడెడు, రోచులు గలమిడిగ్రుడ్లు దనర
మెఱుఁగారుకెంజాయ మెఱసినయెఱుకల, మోపున నెసఁగుపెఁ మ్రోఁతతోడఁ

గాళులభీషణాకారత వేళ్లతోఁ, [1]లీలమై నెగసినశైల మనఁగఁ
గరము గ్రమగు మొగమిరు దెసముఱియించి, యామివంబులయుక్కలరసికొనుచు
తే. నచటిబయ లెల్లఁ దాన యై యక్కజంపుఁ
జందమును ఘోర మైనని స్వనముఁ జండ
గతియు భూతవితానభీకరముగా ను
లూక మొక్కటి వచ్చె భూలోకనాథ. 16

అశ్వత్థామ యులూకంబు కాకంబులఁ జంపుట నాలోకించుట.

వ. వచ్చి యవ్విటపివిటపంబు నూఁది యక్కాకంబుల నాలోకించి యంగంబుల యుద్భటత్వం బుడిపికొని గమనంబు తిన్నఁదనంబు దలకొనఁ జొచ్చి వాని నాక్రమించి. 17

ఉ. కొన్నిటికంఠముల్ నులువుఁ గొన్నిటికాళులు ద్రుంచు నుగ్రతం
గొన్నిటిపక్షముల్ నఱకుఁ గొన్నిటిపొట్టలు వ్రచ్చు లీలమైఁ
గొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు నిట్టు ల
య్యన్నిటి నయ్యులూకము రయం బెసఁగన్ వధియించె భూవరా. 18

వ. ఇవ్విధంబున నిద్రావివశంబు లైనయవ్వాయసంబుల వివిధంబు లగువధంబుల గీటడఁగించి యాకౌశికంబు శత్రువులం బొదివి సమయించిన నేటిమగని మాడ్కి మోదంబు నొందినం గని యగ్గురుసందనుం డాచందం బొనర్చుటకు డెందంబున నుత్సాహంబు వెడమి పొంగి తనలోన. 19

తే. ఇవ్విహంగమ ముపదేశమిచ్చె నాకు, నిద్రవ్రాలంగ శత్రుల నిగ్రహింతు
నింతలె స్సగునే ముందరేమి తెలియఁగ, గాన నై తిని నాపూనుకార్యమునకు. 20

వ. అని వెండియు. 21

ఉ. పాండునరేంద్రనందనుల బాంధవపుత్రయుతంబు గాఁగ ను
ద్దండత నే వధింతు నని దర్ప మెలర్పఁగఁ గౌరవాధినా
థుండు వినంగఁ బల్కితిని దుర్దమదోర్బలు లమ్మహాత్మకుల్
గండున బెట్టు పైఁ బడుట కార్యము గాదు దలంచి చూడఁగన్. 22

క. అరవాయి గొనక బెట్టుగఁ, బరిగొని యక్కడిఁదిమగలబ్పు నడరుట యు
ద్ధురగతి నగ్నిజ్వాలో, త్కరముపయిన్ మిడుత యుఱుకు కరణి కాదే. 23

వ. పాండవులం బరిమార్చుపని నేఁడ చేయక మఱి చేసిన రారాజు నిర్గతప్రాణుండై న నాకెలసం బెవ్వరి కెక్కెడుఁ జక్కటిలో షిబవరంబున నబ్బలుమగల గెలువరా దని యి ట్లురియాడునాచిత్తంబుచింతాపరంపర వాయ నీపక్షివిచేష్టితంబు లో చనగోచరం బయ్యెఁ బగతురఁ దెగటార్చు నెడ నన్యాయం బనక యుపాయం బె య్యది దొరకొనిన దాన నుత్సహింపవలయుట శాస్త్రసిద్ధంబ కాదే యెట్లనిన.

[1] నెగసినతుంగశైలేంద్ర మనఁగ.

తే. ఎత్తినప్పుడు విడియుచోఁ గనిఱకటంపుఁ, దెరువునందు నడపు సెడి తిరుగఁబడిన
యట్టియెడ నిద్రవోయెడు నవసరమున, శాత్రవుల బెట్టు వైఁబడి చంపవలయు.

వ. అనునీతివాక్యంబులు విందు నంగీకృతక్షత్త్రధర్ముం డగువానికి నిట్టివి కర్తవ్యంబు లట్లుఁ గాక పాండవేయులు పితామహగురులైనభీష్మద్రోణులఁ దెగటార్చునెడం జక్కటిగల తెఱంగున సంగరంబు చేసిరె యంగరాజును రారాజును బరిమార్చినభంగులఁ దలంపం గూడునె కావునఁ గల్మషోపాయు లగుకౌంతేయుల నిద్రాసమయంబున (గొబ్బున) నిగ్రహించుట నీతియ కాని నింద్యంబు గాదని నిశ్చయించె నట్లు క్రూరవ్యవసాయుం డగునగ్గురుసుతుండు దనమామను గృతవర్మను మేలుకొల్పి యిట్టిసమయంబున నిద్రించితి మని లజ్జించుచున్నయారథికవరులతో ని ట్లనియె. 26

సీ. మొగదప్పితిమి రణమ్మున మన మకట ము,ప్పురము రారాజు నొక్కరునిఁ బాండు
తనయులు దమసారుఁ దారును బెక్కండ్రు, గూడి చుట్టును ముట్టి గుల్లపఱచి
రేకాదశాక్షౌహిణీశ్వరుఁ డట్లొంటి, మెయిఁ జిక్కి పోరుచుండియును బాడి
దప్పఁ డవ్విభుని నధర్మవిక్రమమునఁ, బాపాత్మకుం డగుబకవిరోధి

ఆ. గూల్చె నంతెఁ బోక కురుదేశరాజ్యాభి, షిక్తమైనయతనిశిరము దన్నెఁ
బరిభవంబు నొంచెఁ బ్రాణాంతకరవేద, నాతిశయముకంటె నన్న రేంద్రు. 27

క. లావును వెరవును గలుగుమ, హావీరు లనేకు లట్టు లన్నిదినము లా
భూవిభునకై పెనఁగి జయ, మీవలఁతులు గాక పోయి రే మన వచ్చున్. 28

ఆ. ఎవ్వ రెంతఁ జేసి రేనియు విధి యొండు, దలఁప నాఫలంబు దలఁగ కేల
యుండు నిట్లు గాఁగ నున్నది గాకేమి, యొసకమెసఁగు కౌరవేంద్రు మనుపు. 29

వ. అని పలుమాట లాడి మీమది కలంగకున్న దేని యీమహావ్యసనంబునకుఁ గర్తవ్యం బెద్ది చెప్పవలయు ననినఁ గృపాచార్యుండు ధనురాచార్యనందను మొగంబు గనుంగొని నీవు చెప్పఁ దలఁచినయంతవట్టునుం జెప్పి కార్యం బడిగి తేని నాకుఁ దోఁచినదానిం జెప్పెద విను మని యి ట్లనియె. 30

### కృపాచార్యుఁ డశ్వత్థామకు నీతివిశేషంబు లెఱింగించుట.

సీ. ప్రారంభముల కెల్లఁ బౌరుషమ్మును దైవ, మును సాధనమ్ములు వినుము వాని
లోన నొక్కటి చేతఁ గానేర దనఘ త, త్ఫలసిద్ధు లెట్లన్నఁ దఱచు వాన
కారుపొలంబునఁ గల్లెనేనియుఁ గొల్చు, గావింప నేర్చునే యేవిధమున
వల నేర్పడఁగ దున్నఁ బోలములో నైన వ, ర్షంబు లేకున్న ధాన్యంబు లగునె

ఆ. కాఁపు లావు వెరవు గల్గి కర్షనము సే, యంగ వృష్టి దగినయట్లు గలుగ
ఫలము గల్గునట్లు పౌరుషంబునకు దై, వంబుతోడుపాటు వలయు నెందు. 31

వ. అదియునుం గాక. 32

క. తగుపని కుద్యోగించుచుఁ, దగ వెఱిఁగెడు హితుల కనుమతంబుగఁ జేయఁ

జగతీసురవరకార్యము, లగు వారికిఁ గలుగు విధిసహాయత్వంబున్. 33
క. ధర్మము దప్పక నయగతిఁ, గర్మాచరణంబు సలుపఁగా[1] ఫలసిద్ధిన్
నిర్మలయశ మగుఁ దప్పినఁ, బేర్మి సెడదె నింద రా సభేద్యోత్సాహా. 34
ఉ. నీతి దొఱంగి కార్యముల నెట్టన యాగ్రహవృత్తిఁ జేసినం
బ్రీతిగ సిద్ధిఁ బొందినను భీతియు గుత్సయుఁ బుట్టు భూజను
ల్వేతురు చేటు సేఁతలు ఫలింపక తక్కిన మున్న నచ్చు న
త్యాతురతాస్పదంబు లగు నాపద లిద్ధవివేకవైభవా. 35
ఉ. క్రోధము లోభమున్ భయముఁ గూరిచి త్రిప్పుఁగోప దుష్క్రియా
సాధనవృత్తి దుర్జనుఁడు సజ్జను లాఁగఁగఁ జేయు కార్యముల్
బాధలఁ బెట్టుకున్న సిరి పాయఁగఁ జేయక యున్న వానిఁ దీ
ర్వ్యాధినితాంతదుఃఖహృదయత్వము చేరక యున్న వానికిన్. 36
చ. వినుము కురుక్షితీశుఁడు వివేకవిదూరుఁడు క్రోధలోభముల్
మనమునఁ జేర్చినన్ దురభిమానమునన్ హితు లెంత చెప్పిన
న్వినక బహుప్రకారముల నిందకు నోర్చి పరాభవించె స
జ్జను లగుపాండుపుత్త్రుల నసత్పథవృత్తికిఁ జేటు దప్పునే. 37
వ. అని పలికి యతండు మీఁదు గలఁగక యున్న దేని కర్తవ్యంబుఁ జెప్పవలయు నని
యడిగినమాట లుగ్గడించి. 38
క. జగ మెఱుఁగఁగ దుశ్శీలుం, డగుభూనాథుండు వ్రాయుసత్తుతె పోఁగాఁ
దెగడుం జేటుఁ గలిగి వగ, మిగులను మది గలఁగదే యమిత్రధ్వంసీ. 39
వ. అది యట్లుండె మన కిప్పు డిది కర్తవ్యం బని నిశ్చయింపు మన మేమి నేర్తుము
తగవు తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 40
క. మన మందఱమును ధృతరా, ష్ట్రుని కడకుం బోయి కార్యసూత్ర మతనిచే
వినవలయు నాతఁ డెయ్యది, గని పలికిన నదియ మనకుఁ గర్తవ్య మగున్. 41
వ. అమ్మహీకాంతుండు. 42
క. తానును గాంధారియు నె, ద్దానిం గార్యంబు గాఁగఁ దలఁచి పనిచినన్
దానికిఁ గా దన వలవదు, పూని యనుష్ఠింత మదియు బోగ డొందించున్. 43
వ. వారలకడ విదురుండు నుండు నమ్మువ్వురు విచారించి చెప్పినకార్యంబునకు నింద
గలుగ దట్లుం గాక యెట్లు పొరలినను దైవోపహతంబు లగుకార్యంబులు సిద్ధిఁ
బొందునె యడిచిపడ వలవదు విచారించికొంద మనవుడు శోకదందహ్యమాన
మానసుం డగుచు నగ్గురుపుత్త్రుండు కృతవర్మను నతని నాలోకించి. 44

అశ్వత్థామ కృపాచార్యకృతవర్మలతోఁ దనపూన్కి స్థిరీకరించుట.

సీ. వెర విట్టి తెఱఁ గిది వెంగలితన మని, యెల్లవాఁడును దనయెఱిఁగనట్టి

1 ఫలసిద్ధుల్.

తెఱఁగున నిజకార్య[1]దృష్టియ కయికొను, నొరులనేర్పులు పట్టకొల్లఁ డాత్మ
బుద్ధియ మేలని పొగడు నన్యులచిత్త, వృత్తుల నిందించు వివిధగతులఁ
జెందెడునాత్మయు చేతఃప్రవృత్తిన, మఱయఁడు దాన బాల్యమునఁ దలఁచు

ఆ. తలఁపు గీడు చేసియొలప్రాయమున నొందు, తలఁపునందుఁ బట్టుకొలుపుఁ బ్రీతి
ముదిమి వచ్చినతఱి నడిమియును విడిచి య, న్యంబు లైననేర్పు లాచరించు. 45

క. ఆపదఁ బడి యొక్కఁడు న, వ్యాప్తపారము గాఁగఁ జూచి [2]దాని నడపు శ్రీ
ప్రాపించిన నదిఁ దాఁటడొకొ, మాఁపున వర్తించు నది విశుద్ధపదముగన్. 46

క. తగు నని మును మనుజులకు, తెగువ దెసకా మానవుండు దృఢనిశ్చయతం
దగిలినయది మహిమాతిం, బుగ నడలక నడుపు నన్యబుద్ధులు గొనమిన్. 47

వ. మీ రెఱుంగనియది లేదు నాకుం దోఁచినకర్జంబు మన కందఱకును శోకనాశం బగునట్టిది దాని వినుండు చెప్పెదఁ బ్రజాపతి ప్రజల సృజించి విప్రునకు శమంబును క్షత్త్రియునకుఁ దేజంబును వైశ్యునకు దక్షత్వంబును శూద్రునకుఁ ద్రివర్ణానుగామితయు వలయుగుణంబులుగా విధించెం గావున శాంతుండు గానివిప్రుండును దేజస్వి గానిరాజును దక్షుండు గానివైశ్యుండును ద్రివర్ణానుగాముండు గానిశూద్రుండును నిందం బడుదు రది యట్లుండె నేను విప్రకులంబునందు బూజ్యతమం బైనవంశంబునందు జనియించి భాగ్యహీనత వలన క్షాత్త్రధర్మం బనుష్ఠించితి నడుమ నానిష్ఠ వదలి విప్రధర్మంబు మహనీయం బైన దాని యాచరించువాఁడ నగుట నామదికిం జూడ మేలై యుండ దదియుం గాక. 48

తే. మేటివిల్లును దివ్యాస్త్రకోటియును ధరించి మెఱయంగ నాజి వధించెఁ దండ్రి
నొకఁడు నాయనుఁగురూపుమీఱనుండునట్టు, లెట్లుతలయెత్తి మెలఁగుదు నేను జెపుఁడ.

క. వాఁడు మొదలుగాఁ బగతుర, వాఁడి గలుగుతూపుగములవలను మెఱసి యే
నేఁడు వధింపనునెప్పుగ, వేఁడిమిఁ బడఁ జాల కొక్క వెరవు దలఁచితిన్. 50

క. లేదింక బగ యని ధను, రాదుల దెస వాహనములయందును సంత్య
క్తాదరులై పగతురు నేఁ, డాదమఱచి నిద్రవోదు రది తఱి పొడువన్. 51

ఆ. ఓడిపోయి తప్పినూని గట్టును జెట్టుఁ, జేరి యొదిఁగి యున్నవారిఁ గాఁగఁ
మనలఁ దలఁప రరులు మనముల నావంత, శంక లేదు సంతసంబు ఘనము. 52

చ. మదమునఁ దేలి యేమఱినమార్తుర దాడిగఁ బోయి బెట్టు ము
ట్టెద శరజాలసత్వరపరిప్లుతిఁ బల్వురఁ ద్రుంతుఁ గొందఱం
జదుపుదు నుల్లసత్పరిఘసంహననంబునఁ గొన్నికంఠముల్
చిదుముదు నేల రక్తపరిషిక్తము గాఁ గరవాలలీలలన్. 53

తే. గెలుపునూఱట నగ్గలమొదవునిద్రఁ

1 దృష్టిఁ గనుంగొను. 2 దాన నపుడు.

బీనుఁగులుఁబోలె నున్నయాబిరుదుమగలఁ
జంపి పీనుంగుఁబెంట గావింపవలయు
శిబిర మెల్లను భూతముల్ సెలఁగుచుండ. 54

వ. అని వెండియు.

క. కరిహయనరశవముల భ, గ్నరథంబుల నెరసి ద్రుపదనందనగాత్రో
త్కరము పడి యుండఁ జూడక, పరిభవతాపోపశాంతివడయఁగ నగునే. 55

శా. ధృష్టద్యుమ్నుని ముట్టి పట్టుదు మదోద్రేకం బడంగింతు ను
త్కృష్టాస్త్రంబులఁ జంపనల్క పశుభంగిం జంపినం గాని పో
దిష్టావాప్తి యనంగ నా కిదియె భూయిష్ఠంబు గౌంతేయులన్
గష్టస్వైరవిధాభియోగమృతులం గావింతు నుగ్రాకృతిన్. 56

క. అలిగినపినాకిచందం, బలవడ శిబిరంబుఁ జొచ్చి యందఱఁ బగఱం
బొలియింతును శుద్ధుఁడఁ గా, వలదే జనకునకు నాదువల నేర్పడఁగన్. 57

క. పాండవులం బాంచాలురఁ, జండభుజావిభవ మొసఁగ సమయించి కృతా
ర్థుండ నయి పెంపుఁ దేజము, గండును దక్కొండు లేదు కార్యము దలఁపన్. 58

వ. అనవుడుఁ గృపాచార్యుం డి ట్లనియె. 59

సీ. పఱచినవారికిఁ బగ మాఱు పలుపంగ, నుత్సహించుట కడు నొప్పు గాదె
దైవయోగంబునఁ దగినయుద్యోగంబు, నీమానసంబున నెలవుకొనియె
మాకు నీపూన్కి సమ్మత మేము దీనికి, నీతోడివారము నీవు డస్సి
యున్నవాఁడవు నిద్రయును లేక యున్న[1]నీ, వెడగరపడియె దీ యడవిలోన

ఆ. నెమ్మి డప్పిదేఱ నిద్రించి వేగినఁ, దెలివితోడ నత్యుదీర్ణవృత్తిఁ
గడఁగి యేము దోడ నడతేర నడరిన, నరిగణంబు గెలుతు వశ్రమమున. 60

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ పైఁ బోవ ను
ద్ధురలీలం గృతవర్మయుం గృపుఁడు నుద్యోగస్ఫురన్మూర్తులై
వెరవుం జేవయుఁ జూపి తో నడవ దోర్వీర్యోద్ధతిన్ మార్కొన
న్నరయోధావళి గాదు దేవతతికి న్రా దెమ్మెయిం జూడఁగన్. 61

వ. అని మఱియును. 62

చ. విను కృతవర్మ దివ్యశరవేది బలాఢ్యుఁడు శౌర్యశాలి యే
నును సమరోద్యమంబునకు నూల్కొనఁ జాలుట నీ వెఱుంగు ది
ట్లని గణుతింప రాదు గురునట్టిఁడ యీతఁ డనంగ వచ్చు ని
న్ననఘచరిత్ర యిట్టిరథికావలి వైరుల నెట్లుఁ జేయదే. 63

వ. కావునఁ గోదండంబు నెక్కుడించి కంకటం బూడ్చి నిద్రింపు మేము నిద్రాగమ
నంబున జడుల మై యున్నవారము ప్రభాతం బగుటయు నెల్లవారలకు నుల్లంబు

1 'ది,వేగిరపడియెద • వేల యింత' వ్రా. ప్ర.

దలివ్రెందు నప్పుడు గడంగి యోధులం బొదివి పేరువాడి పొలియింతము మనము పాంచాలసహితంబుగాఁ బాండవులం దెగటార్చుట యొండె వారిచేతం దెగుటయొండె నయ్యెడుం గాక రిత్త మరలుదుమే యనిన మామకు నశ్వత్థామ యిట్లనియె.

ఆ. [1]అలుక యెత్తినవానికి నర్థచింత,కునకు నాతురునకుఁ గామగోచరాత్ము
నికిని వచ్చునే వినుము నిద్ర నీవు నెఱుఁగు, దెలిసియుండి యిట్లేటికి నేఁప నన్ను.

క. ఎన్నఁబడి జనులెఱిఁగిన, యిన్నాలుగు తెఱఁగులందు నెయ్యది యైనన్
గన్నుమొగుడ నీయదు నా, కిన్నియుఁ గలుగంగ నిద్ర యేటికి వచ్చున్. 66

చ. గురుదెసనంత నాతురతఁ గూరెద వైరిఁ దలంచి కోపసం
భరితుఁడ నయ్యెదన్ సమరభంగినిరూపణ చింత నొందెదం
గురుపతికిం బ్రియం బొసఁగఁ గోరుట నుత్తలపాటు నొందెదం
బురుషవరేణ్య యే నిదుర పొందఁగ నెమ్మెయి నేర్తుఁ జెప్పుమా. 67

శా. సారాచారనిరూఢుఁ డైనధనురాచార్యున్ వధింపంగఁ గ
న్నారం జూచితి నీవుఁ దత్పరిభవం బట్లుండె భగ్నోరుఁ డై
రారా జెంతయు దీనవృత్తిఁ జెవులారం బల్కఁగా విన్న యే
నీ రేయూరక నిద్రవొందునటె యిట్లేలంటి వీరోత్తమా. 68

ఆ. మనము వినఁగ రాజు పనివినభంగి కే, క్రూరచిత్తుఁ డైనఁ గుందకున్నె
కరుణ లేక యున్నపురుషున కేనిఁ గ, న్నీరు దొరుఁగకుండునే మహాత్మ. 69

చ. అతఁడు మదీయసఖ్యపరుఁ డక్కట యేఁ గనుగంద కుండ నా
క్షితిపతి యిమ్మెయిం బరులచేతఁ బరాభవ మొందె దానిఁ జూ
చితి మును లోకు లవ్విభునిచేటును బాండుతనూజకోటియు
న్నతియును జెప్ప వింటి నది నామది సూడదు నిద్ర వచ్చునే. 70

వ. అదియునుంగాక. 71

మ. కవ్వడియున్ ముకుందుఁడును గావలిగా భయమేది యున్నవీ
డెవ్వరి కైన ముట్టుకొని యే నని పేర్చి జయింప వచ్చునే
యెవ్విధి నైననుం బగఱ యే పడగించుట పౌరుషంబ యే
నొవ్వక గెల్తు రాత్రిమెయి నూల్కొని తాఁకితినేని మాతులా. 72

ఆ. ఇట్లు నిశ్చయించి యొసకంపుఁ గడఁకతో, నున్నవాఁడ నిట్టినన్ను మాన్ప
రామి యెఱుఁగ కంటి రారాజుమన్నన, వమ్ము చేసి మరల వచ్చు నెట్లు. 73

క. సమయింతుఁ బొదివి సౌప్తిక, సమయంబున నెల్లభంగిఁ జతురంగసమే
తము గాఁగఁ బాండునృపసుత, సముదయమును ద్రుపదభూపసంతానంబున్.

వ. సమయించి మఱి విశ్రమించియు నిద్రించియు సుఖించెద నీవు నిద్ర పేరు సెప్పి యు

1 'అలుకవొడమువాని ♦ కర్థచింతునకును, నాతురునకు మన్మథార్తునకును, నిద్రవచ్చునెట్లు ♦ నీవును దీనిని, నెఱిఁగియుండి యేటి కేఁప నన్ను'. అ.ప్ర

ద్యోగంబు మాన్పి మరల్పఁ జూచెద నిది తగ నగునే యనిన గురునందనునకు గౌతముం డి ట్లనియె. 75

కృపాచార్యుఁడు నిద్రాసక్తులఁ జంపఁ దగ దని యశ్వత్థామునకు హితవు చెప్పుట.

చ. అలుక మనంబునం గదిరి | నాతఁడు దాను నెఱుంగఁ డొల్లఁ జేఁ
దెలియఁడు కార్యతంత్రములు | ధీమహితుం డగువాని నైననుం
జెలులును జుట్టలుం దగిలి | చెప్పఁగఁ జొప్పడుఁ గాక తక్కని
ర్కల మగునీతితంత్రము | దిరం బయి చిత్తమునందు నిల్చునే. 76

క. మతి నెప్పుడుఁ దా ధర్మ, స్థితి నూహించుచును హితులు | సెప్పెడి నెర వు
ద్ధతి దక్కి యాచరించుచు, జితేంద్రియత గలిగి నడచుఁ | జెందు శుభంబుల్. 77

తే. దుష్పథంబులఁ జొరనీక | తొలఁగఁ దివుచు
రాప్తజనములు దగ వశ్యు | లయినవార
లందుఁ బుణ్యంబు దొలఁగని | యతఁడు దొలఁగుఁ
దొలఁగ నేరఁడు భాగ్యంబు | దొలఁగువాఁడు. 78

క. మతిమంతు లైనవారికి, హితు లగు వెరవుగలవార | లెఱిఁగింపుగ దు
స్థితి గాకుండఁగఁ గార్యము,గతి యొత్తియుఁ దప్ప నీకియుఁ | గడనఁబలికియున్.

క. నాపలుకువట్టి యాగ్రహ, దీపితుఁ డగు టుడిగి మదికిఁ | దిన్నఁదనము నీ
వాపాదింపుము సలమును, గోపముఁ గ్రౌర్యంబు విడువు | గుణరత్ననిధీ. 80

వ. అట్లైనం బశ్చాత్తాపంబునం బడవు నిద్రించినవానిని నాయుధంబులు విడిచినవానిని వాహనవైకల్యంబు నొందినవానిని శరణుసొచ్చినవానిని వలనీడినవానిని వధియించుట ధర్మంబు గాదీసమయంబున సమస్తసైన్యంబును శొంపనపాంచాలురు నిద్రవోవుదురు నిదుర సావుసట్టిద కాదె పీనుంగులుం బోలెఁ బడి యున్నవారిం బొడిచి పాపంబు గట్టుకొని నరకంబునఁ బడుట మేలె మహాస్త్రవిదు లగురథికముఖ్యులయందు మేటి యనం బరఁగి యింతకు మున్నెమిటం గల్మషంబు సేనినీయట్టివానికిట్టి దుష్కర్మంబు గర్తవ్యం బగునే యిది మడుఁగుఁజీరయందు మసి దాఁకినట్లయ్యెడు సూర్యసంకాశుండ వగునీవు సూర్యోదయసమయంబునఁ బ్రకాశప్రకారం బైన పరాక్రమంబున నుపక్రమింపు మనవుడు నశ్వత్థామ కృపాచార్యున కిట్లనియె.

సీ. నీచెప్పినది యెల్ల | నిజము శాసింపంగఁ, దగువాఁడ వై హితం | బగు తెఱంగు
నా కెఱింగించితి | నీ కేను జెప్పెద, నేర్పడ వినుమయ్య | యెల్లనృపులు
గనుఁగొనుచుండ మ | జ్జనకుని సన్న్యస్త, శస్త్రుని నట్లు పాం | చాలరాజ
సుతుఁడు ధృష్టద్యుమ్నుఁ | డతిపాతకం బని, కొంకక తల పట్టు | కొని వధించె

తే. భీష్ము నాశిఖండి పేరఁ | గృత్రిమసమ,రమున నర్జునుండు | సమయఁ జూచె
నరద ముర్విఁ గ్రుంగి | యనువు దప్పిన డిగ్గి, యెత్తుచుండఁ గర్ణు | నేసె నరుఁడు. 82

ఆ. చేయి నరుఁడు దునుమఁ | బ్రాయోపవేశప్ర,వృత్తిమైఁ బ్రశాంత | చిత్తుఁ డైన

పుణ్యపురుషు నట్టి భూరిశ్రవుని గృష్ణు, ననుజుఁ డట్లు సంపె నాగ్రహమున. 83

చ. పలువురు గూడి కౌరవనృపాలకు నొక్కరుఁ జుట్టుముట్టి వి
చ్చలవిడిఁ బాపకర్మ మనుశంక యొకించుక యేని లేక యూ
రులు గద నుగ్గు సేయఁగ మరుత్సుతునిం బురికొల్పి రిన్నిభం
గుల మును వారె కాదె చెడఁగ్రొచ్చిరి సంగరధర్మసేతువున్. 84

వ. వారి నెట్లు నిందింపవు మమ్ము నెట్లు వారించెద వాలింపుము. 85

ఆ. తొడలు విఱిగి నేలఁబడియుండి ననుఁ గని, మానవేంద్రుఁ డట్లు దీనవృత్తి
నాడెఁ గొన్ని మాట లవి యంతరంగంబు, నందుఁ జిక్కికొనక యలఁత సేసె.

వ. వాని వెలార్చవలయు మజ్జనకహననసంతుష్టుం డగుధృష్టద్యుమ్నుండు లో
నై నయపాపాత్ములఁ బాపంబు తెరువున రూపుమాపెద దీనం జేసి కీటజన్మంబు
పాటిల్లినను మేల కాని యీకడంక మాన నేర నన్ను వారింప నెవ్వరివశం బగు
నని దిగ్గన లేచి యగ్గురుతనయుండు రథం బెక్కినం గనుంగొని యగ్గౌతముండును
గృతవర్మయును 87

ఆ. ఏకనిశ్చయమున నిట యేఁగుదెంచితి, మనఘ నీవు నేము నధిపునికి
నిట్టిమమ్ము వేఱు పెట్టి యొక్కటి కార్య, మాచరించువాఁడ వగుట దగునె. 88

చ. అనవుడు నాతఁ డిట్టు లను నమ్మహితాత్ములకే నవశ్యముం
జని ద్రుపదాత్మజుం బొదివి చంపెద దుర్గతిఁ బోవుచావుగా
ఘనభుజశక్తిశౌర్యము నకంపితధైర్యమురుఁ వెలుంగ మీ
రును దెలివొంది కూడికొన రాత్రికి నెక్కుడ మెల్లభంగులన్. 89

ఆ. ఒండుతలఁపు లుడిగి రం డని పోవ నా, రథికవరులు గడగి రథము లెక్కి
మొనసి చనిరి వారు మువ్వురు నగ్నిత్ర, యంబుఁ బోలి యొప్పి యప్పు డధిప.

వ. అట్లు చని నిద్రావివశం బైనపాండవశిబిరంబు డగ్గఱి రనిన విని ధృతరాష్ట్రుండు
సంజయున కిట్లనియె. 91

ఆ. రాజు గూల్చి జయముఁ దేజంబుఁ బొందిన, యత్యుదగ్రవిభవు లైనయరుల
శిబిర మాక్రమింపఁ జిత్తంబులందుఁ దెం, పొదవి మువ్వు రట్లు గదియు టరిది. 92

వ. వారు చేసినవిధంబు వివరింపు మనిన నాసూతసుతుండు విచిత్రవీర్యనందనున
కిట్లనియె నట్లు శిబిరద్వారప్రదేశంబునకు నడచి సహాయులం గడచి యశ్వత్థామ
యుద్దామరభసంబునం జన నుత్సహించె నట్టియెడ. 93

అశ్వత్థామకు శివుఁడు భూతాకృతి యై తోఁచుట.

సీ. క్షురితశోణిత మగుశార్దూలచర్మంబు, పరిధానకరణి విభాసితముగ
నురగాత్మకము లైనయుపవీతములు హారములు నంగదంబులు పొలుపుమిగుల
వివృతవిశాలాస్యవివరంబు నిశితదంష్ట్రాసికరంబు ఘోరంబు గాఁగ
భాసురకాంతివికాసంబు లగులోచనంబులు బహుసహస్రంబు లొప్ప

తే. నుగ్రమును సుందరంబును నుజ్జ్వలంబు, నై మహాకార మద్భుతమావహింప
భూత మొక్కటి భీషణస్ఫురణ మెసక, మెసఁగ నగ్గురుపుత్రుకట్టెదుర నిలిచె.
క. విను మాభూతం బిట్టిది, యని కలరూ పేర్పఱింప నమరులకు నశం
బె నరేంద్ర తదాకృతి గనుఁ, గొనినఁ భేదిల్లవలయుఁ గొండకు నైనన్. 95
వ. ఇట్లతనియగ్రభాగంబున నావిర్భూతం బైనయమ్మహాభూతంబు నాస్యకుహరం
బున నాసికావివరంబులఁ జెవులఁ గన్నుల నన్నింట మంటలు వెడలి మింట
నడరఁ దదీయతనుతేజోమరీచిసంఘంబుల శంఖచక్రగదాహస్తు లైన హృషీకేశు
లనేకులు వెడలి రిట్లఖిలభూతభయంకరం బగునమ్మహాభూతంబు నాలోకించి
యవ్వీరవరుండు. 96
చ. హృదయమునం గలంక యొకయించుక యేనియు లేక వీఁకసం
పద యలరంగ భల్లముఖబాణతతుల్ నిగిడింపఁ బెద్దగా
వదనము విచ్చి భూత మనివార్యవిధంబునఁ ద్రావె బాడబం
బుదధిజలంబు ద్రాగెడుమహోగ్రసముద్ధతి వాని నన్నిటిన్. 97
చ. అతులశరంబు లట్లు వృథ యైనఁ గనుంగొని ద్రౌణి రక్తిమం
డితమహనీయశక్తి నిగిడించిన భూతముఁ గాంకె యంత్యకా
లతిమిరవైరిమండలవిలగ్నమహోల్కయుఁ బోలెఁ బిన్నపి
న్నతునియ లై యడంగె నరనాథ యతండు విషాద మందఁగన్. 98
చ. అలఘుతరాత్మసారుఁ డగునగ్గురుపుత్రుఁడు ఘోరఖడ్గముక్
బిలగతసర్పముం దిగుచుభీషణరేఖ నటించుభంగి న
గ్గలపురయంబునం బెఱికి గాఢవిముక్తము గాఁగ వైచినం
బొలుపఱి పోయె దూఁదిక్రియ భూతశరీరసమాగమంబునన్. 99
తే. సరభసంబుగఁ దోమరసమితిఁ జక్ర, వితతిఁ బఱఁగించి పేర్చె నవ్వీరవర్యుఁ
డదియు నదియును దోఁట్టోడనల్ల నగుచు, మ్రింగె నమ్మహాభూతంబు మేదినీశ.
క. అలిగి యతండు నితాంతో, జ్జ్వలగద వైచుటయు నదియు సత్వరలీలన్
జలచర మామిషముం గొను, పొలుపు నెఱయ మెఱయ మ్రింగెభూతం బధిప.
ఆ. ఇవ్విధమున సకలహేతులు నష్టమయి, పోన నతివిమగ్నబుద్ధి యగుచు
నట్టు నిట్టుఁ జూచు నతనికి బహుజనా, ర్దనులు దోఁచి రంబరమున నెల్ల.
ఉ. భీకరవిష్ణురూపములు పెక్కిటు లొక్కటఁ దోఁచఁ దీవ్రతా
పాకులమానసుం డగుచు నగ్గురుసూనుఁడు దుర్మనంబునం
జేకొన నైతి నట్లు కృపుచెప్పిన సత్యహితోపదేశముల్
నాకిది పెద్దయే యని మనంబున నిట్లని పల్కె వెండియున్. 103
ఆ. మహితశాస్త్రకలితమార్గంబు విడిచి ని, జేచ్ఛఁ బగఱ గెలువ నెవ్వఁ డరుగు
వాని నయ్యధర్మవర్తన క్రౌర్యము, యెవ్విధమునఁ జెఱుచు నింత నిజము. 104

